# కథాకావ్యము

(పద్యము

త్యాగి



ప్రకాశకులు

శ్రీ మార్కండేయ భవనము

నరసరావుపేట

గుంటూరు జిల్లా

౧౯౩౮



[వెల ౧-౨ అణాలు

# కృతిసమర్పణము

సీ. ఏమహామహునకు నిద్ధ స్వభావంబు
శాంతియు మితవాక్యసరణి సతత
మేభ క్తవర్యుని హిత సత్యసంకల్ప
మన్నిట నెఱవేఱు నడ్డులేక
యే సుధీశ్రేష్ఠున కెప్పుడు విజ్ఞాన
సముపార్జనమున నాసక్తి యధిక
మే ధైర్యధుర్యుని నెందు ద్వంద్వము లెవ్వి
మోదఖేదంబుల ముంపఁజాల

వేదయాపరు ప్రేమార్ద్రదృష్టివలన
వృద్ధినొందితి విజ్ఞానసిద్ధిఁ గంటి
నట్టి మత్పితృపాదులయంఘ్రియుగళి
కర్పణమొనర్తు నీకృతి నధికభక్తి.

ॐ नमोभगवते ज्ञानानन्दाय.

"క. అమల బ్రహ్మానందా
త్మము సజ్జనసేవ్య మతులతత్త్వాతీతం
బమృతం బగు నిత్యానం
దమ పీ వని యర్చనేతు జ్ఞానానందా."

[శ్రీ జ్ఞానానందసువర్ణమాల]

# విషయసూచిక

# పీఠిక

ఈ గ్రంథము కథాకావ్యమునందలి పద్యభాగము. నిరుడు ప్రకటింపఁబడిన గద్యభాగమునకుఁ దోడుగా నిది యిప్పుడు ప్రకాశితమై మత్పితృపాదుల కంకిత మీయఁబడినది. నా కప్పుడప్పుడు స్ఫురించిన భావములు కథారూపమున నిందుఁ గలవు. విడిగ సన్న చాటువులనుగూడ ప్రకీర్ణమను శీర్షిక క్రిందఁ జేర్చితిని. ఇట్లు గద్యపద్యాత్మక మగుకథాకావ్యము మన్మాతాపితల కంకితము గావించి రసజ్ఞులగుపాఠకుల యెదుట నుంచుచున్నాను.

ఇందు 'సహృదయత్వము' అను పద్యమునందలి భావము నా చిన్ననాఁటిది. 'బోధిగుహ' అను పద్యమునందలి భావము గంగోత్తరవన్నెన్న బోధిగుహాయందే వ్రాయఁబడినది. గంగాజన్మస్థాన మగుగోముఖకైలాసమును గాంచిన తరువాత నది స్ఫురించినది. 'మానవోదంతము' పెద్దలవలన విని నన్నయభట్టారకుని సీసపద్య నియమముల ననుసరించి వ్రాసితిని. 'యోగిని' కలలోని వృత్తాంతము. సాంసారికమైన శ్రద్ధయు వాత్సల్యమును యోగమును పేనునకుఁ దగినవనియు, నట్టి యోగమునకు నగ్రస్థానము నలంకరించిన యవ్వ, 'యోగిని' యను పేరున కర్హయని భావించి యా పద్యమున కానామ ముంచితిని. 'సహనము' లాద్యువాలన్నియు వ్రాసిన

హిందూ దేశ వృత్తాంతములనుండి గ్రహింపఁబడినది. విప్పర్ల యను గ్రామసమీపమునఁ బెక్కేండ్లు జీవించి 1923 సంవత్స రమునఁ బెద్దగాలికిఁ బడిపోయిన పెద్దమఱ్ఱినిగూర్చినశోక గీతికయే, 'పెద్దమఱ్ఱి' యనుపేరఁ బఱఁగుచున్నది. 'ఇరువురు' అను పద్యము దాచేపల్లిలో నాగులేటి యొడ్డున 1928 సంవత్సర ప్రారంభమున నారంభింపఁబడి 1933 సంవత్సరమునఁ బూర్తి చేయఁబడినది. మిగిలినవి సందర్భోచితముగ వ్రాసినవి.

ఈ గ్రంథమునందలి పెక్కుభాగములను సవరించు టలోఁ దోడ్పడిన శ్రీకవిశేఖర సూక్తిసుధానిధి వడ్డాది సుబ్బా రాయఁడు గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ప్రూఫులు చూచుటలోఁ దోడ్పడిన శ్రీ మల్లాది లక్ష్మీ నృసింహశాస్త్రిగారును గ్రంథమును శీఘ్రముగ ముద్రించి యిచ్చిన సరస్వతీ ప్రెస్ ప్రొప్రయిటర్లు శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామినాయఁడు గారును నా కృతజ్ఞతకుఁ బాత్రులు.

ఇట్లు
సజ్జనవిధేయుఁడు
'త్యాగి'

# సరస్వతీ సంబోధనము

చ. పలుకు సరస్వతీ తెలుఁగుఁ
బల్కుల సుశ్రుతి మేళగించి, పె
ల్లలమి వసంతసూనముల
యందలి చల్లని తీయజల్లులై
లలనల పల్లవాధరము
లన్ జెలువారు సుధాప్రవాహమై
జలజల వారు సత్కళా ర
సంబులఁ జక్కొరలన్ హసింపఁగన్. ౧

చ. కలకలరావముల్ సెలఁగఁ
గా మృదుపల్లవరాజి మెక్కి కో
యిల కులముల్ కుహూ యని ధ్వ
నించెనొ కేకులు దివ్యమేఘశో
భలఁ గని విచ్చి పింఛముల
బంధురరీతిగ నాలపించెనో
ఫలరస మాని కీరములు
పల్కెననన్ వచియింపు శారదా. ౨

చ. వెలయుచునుండఁ బాదముల
విస్ఫుటమై గలుగల్లు మంచు ని

ర్తల యతులున్ గణంబులును

ప్రాసము లాదిగఁ గల్గు లందమై

సలలితమైన భాషయు ను

శబ్దగుణంబులు రీతిసంపదల్

కలిగి యలంక్రియాసహిత!

లాస్యమొనర్పఁ గదమ్మ భారతీ! ౩

చ. కలిగె ఫలంబు నాకనకుఁ

గమ్మని సత్కథలన్ వచింపఁ బ

ల్కుల నమృతంబు గల్గు కవి

లోకము నందను నాదుఁ దీర్చఁగాఁ

గలిగెను దానవకీసకృపఁ;

గమ్ము కవిత్వపటుత్వసంపదల్

గలుగ ననుగ్రహింపఁగదె

కంజజురాణి! భజింతు వాణి! నిన్. ౪

# కథాకావ్యము

## సహృదయత్వము



చ. కల దొక చిన్నవాఁగు చిర
కాలమునుండియు మాదుపల్లెకున్
వెలుపలఁ బాఱుచుండును వి
విక్తతలంబునఁ జెట్లు గుట్టలున్
గల పొలిమేర యద్ది కల
కంఠకుహూరవముల్ సెలంగు ని
ర్మలవనసీమలున్ గలవు
ప్రాంతములందు మనోహరంబుగన్. ౧

చ. సలలితహంసతూలమృదు
శయ్యలు రాలగుఁ దత్సుసైకత
స్థలములఁ బోల్ప, స్వచ్ఛమగు
స్వాదుజలంబులతోడ నుంతయేన్
దులయె సుధారసంబు, నది
తోయము సల్పెడు మందమందసం
చలనము హంసయానల ప్ర
చారములన్ వెలివెట్టు నిచ్చలున్. ౨

చ. కలచుచు వారిపూరమును
 గ్రందుగ వారిచరంబు లుండెడున్
గొలఁకొల మంచుఁ జెంతలకు
 గొక్కెర లాదిగఁ బక్షు లుండు వే
బిలబిల నీర మాన సర
 విన్ జనుదెంచును గృష్ణసారముల్
మిలమిల లాడు చవ్వలన
 మిక్కిలిగాఁ జరియించుఁ గీటముల్. 3

చ. వలయముగా నొకొక్కడను
 వట్రువసుళ్లను నొక్కచోటఁ దుం
దిలముగ నొక్క దేశమునఁ
 దీనవలెన్ మఱియొక్కభూమియం
దలమి విశాలమై యొకట
 నద్భుతరూపము లైన దీవులన్
జలుకన నిర్గతిన్ సలుపఁ
 జోద్యముగా వహించు నీరముల్. ౪

చ. గలగలనాదునన్ మెఱకఁ
 గప్పుచు రాలను గ్రిందఁ ద్రోయుచున్
సులభముగాను పల్లములఁ
 జొచ్చుచు నొడ్డుల మెల్లఁ గోయుచున్
కలసుమనోజ్ఞతాళయుత
 గానముఁ బోలెడు మర్మరధ్వనిన్

వెలయును వాఁగు చిత్తయుని
వేయువిధాల నతించునో యనన్. ౫

క. పొలుపుగ సైకతములపై
నలదర్భలు పూరులాది యల్లల నాడున్
బలుతెక్కెంబులచాడ్పున
నిలచి నదీప్రాజ్యరాజ్యనియతిని దెలుపన్. ౬

చ. కొలకులతో రహించు వన
కంజములందలి పుష్పసౌరభం
బులఁ గొనివచ్చి వారికణ
ముల్ వహియించుచు మందగాములై
యలమి శ్రమాపనోదకము
లై ప్రసరించెడి పిల్లగాడుపుల్
జెలువము మీఱఁ బాంథులకుఁ
జెమ్మటఁ బాపి సుఖంబు నిచ్చెడిన్. ౭

చ. కలదు కవిత్వ మీయెడను
గన్గనిభావము లుద్భవించు నీ
నెలవున మేనువాల్ప; నవ
నిన్ సుఖదుఃఖములెల్ల మాని యీ
లలితవినోదసంపదల
లాలన మందెడువాఁడె ధన్యుఁడం
చలరుచు సైకతస్థలుల
హాయిగఁ బండగ నొక్క రేఁపటన్. ౮

ఉ. తీరమునందుఁ గల్గు నొక
తిన్నని బాటను నేగుచుండి యె
వ్వారలొ కొంద ఱిట్లనిరి
"వహ్వారె! పిల్లఁడు తిప్పలందునన్
గోరి శయించినాఁ డితఁడు
కూడును గూరయు నొల్లఁడేమొ, వ్యా
పారములేని వారి కిటు
వంటివె కాలముఁ బుచ్చుమార్గముల్.

ఉ. చల్లని గాడ్పుకోస మఁట,
చాలును; కాక శరీరమంతటన్
బెల్లుగఁ గల్గఁ బోలు బళి!
పేడయుఁ బెల్లము నేర్పరింపగా
నొల్లఁడు వట్టితిన్నెలను
నొక్కఁడు పండగ సిగ్గులేదె యీ
ఱెల్లులు రాలు నీళ్లితని
రేపును మాపును మేపఁ గల్గునే. ౧౦

ఉ. ఎందుకు నిష్ప్రయోజనఁపు
హీనఁపువాఁ గిది, చెట్టుచేమ లే
దిందుల, వట్టి చౌడు లిట
నేమని సంతసమందఁబోలు నే
యందము గల్గు నిచ్చట స
మాదరముం గన వర్ష కాలమం

దెండఱకో యస్సాతనము లు
శోకములన్ గలిగించెదున్ గదా. ౧౧

చ. చెఱువును గాదు పంటలకుఁ
జేరువ భూములు కేల మెత్తఁగా
వరలు కొలంకు గాదు, వడిఁ
బాఱెడు నేఱును గాదు, పంట క
క్కఱకును వచ్చు నేదియును
గా దిది, యెయ్యది చూచి యాతఁ డే
వెఱపున సంతసించు నిట,
వెఱ్ఱియొ పిచ్చియొ వీఁడు గావలెన్." ౧౨

క. అని నింద సేసి యరిగిరి
విని యూరక యుండె నేఁడు, విశ్వములోనన్
ఘనవస్తుల నిజతత్త్వముఁ
గనునె యెఱుఁగఁ బామరులకు సహృదయులవలెన్. ౧౩

శా. "అన్నా హంసము! యెందునుండి యిటు రా
నయ్యెన్", "బకశ్రేష్ఠ, సం
పన్న శ్రీయుత దివ్యమానససరః
ప్రాంతంబునందుండి", "యే
మున్నన్ గాంచితి వందు", "కాంతియుతమై
యొప్పారు రత్నంబులే",
"యెన్నన్ నత్తలు పీతలున్ గలవె", "లే"
"ఛీఛీ! హిహీ యింతియే". ౧౪

# బోధి గుహ

## ౧. హి మా ల య ము



చ. శివునకు నాటపట్టాను ప్రసిద్ధిగ
 జన్మము దాల్చెఁగట్టునై
 చ్ఛివయును రుద్రుఁ డెల్లతఱి
 సిద్ధముగా విహరించుమెట్టు సం
 భవ మగుమిట్టు జాహ్నవికి
 భవ్యజలు స్యంద గణేశ వీరభ
 ద్రవరుల కున్కిపట్టు హిమ
 రాజితపర్వతరాట్టు నన్నెడన్. ౧

ఉ. నందియు భృంగియున్ మొదల
 నంతబల ప్రసుధాళి వాసమున్
 వందితధాతృముఖ్యసుర
 వల్లభనిత్యమహావికాసమున్
 విందగు నప్సరోంగనల
 వీణియతంత్రులచే సుధామధు
 స్యందివిలాసమున్ ప్రబల
 సత్వవిభాహిమవాస మెన్నెదన్. ౨

చ. ఋషులు యుగాదినుండి ముని
 వృత్తి వహించిన పల్లె క్రీడయున్

మిషఁ జని భంగమున్ సలుప
　　మేనక మున్నుగ దేవకన్యకల్
సుషమను జూపు నిల్లు విధి
　　చోదితతత్తృషయాంతమందునన్
విషయము కెల్లతల్లి సద
　　భీష్టదకల్పకవల్లి నెన్నెదన్. ３

చ. మును రఘువంశజుల్ మునిమిఁ
　　బొంది తపంబును జేయుచోటు న
ర్జునునకు నీశుఁ డద్భుతము
　　చొప్పడ నిచ్చిన మిచ్చుపాటుఁ దా
మును తుది పాండుసంతతులు
　　మున్నుగ స్వర్గము నెక్కునేటు నా
మునుపటిగాథ లన్నిటికి
　　మోఘుఁ(పు)మాటును సంస్తుతించెదన్. ౪

శా. కైలాసాద్రికిఁ బ్రాంతమున్ శుభమనః
　　కాసారసంక్రాంతమున్
లీలావర్తితసిద్ధసాధ్యగణని
　　ర్నిద్రప్రభాక్రాంతమున్
ప్రాలేయ ప్రతిబింబితార్కకిరణ
　　ప్రాగల్భ్యభాస్వంతమున్
ఫాలాక్షార్చనశాంతమున్ సుహిమవం
　　తంబున్ బ్రశంసించెదన్ ౫

సీ. ఆవంకఁ జూడ నేత్రానందకరము గా
        రీశంకరాఖ్య ముర్వీధరాగ్ర
మీచాయఁ జూడఁగా నెంతేని మానసం
        బలరించు బదరీశు సద్రిసీమ
ఆ చెంతఁ జూడ నాహా గోముఖం బది
        జన్మసాఫల్యంబు సలుపు శృంగ
మీజాడఁ జూడ మేనెంతో గగుర్పాటుఁ
        గల్గించు కేదారకప్రసీమ
గీ. ఎన్నియని పేరుపేరున నెన్నఁగలము
స్వచ్ఛనీహారవర్ష సంఛన్న విపుల
సురుచిరోన్నతశృంగ సంశోభితంబు
వర్ణనాతీత మీ హిమవన్నగంబు. ౬

సీ. ఇదె మాధవీలత గద, సౌరభము వెద
        జల్లి ఘ్రాణము నల్లసిల్లఁ జేయు
ఇదె శిరీషాగము గద, కేసరంబుల
        కన్నులకమృతమై సున్నితమగు
ఇదె ప్రియాళుద్రువుగద, పుష్పవిస్ఫూర్తిఁ
        జూడ నబ్బురమయి సొంపుఁగులుకు
ఇదె దేవదారువు గద, రసస్యందియై
        కర్పూరసౌరభ కలితమగును
గీ. ఆటవికమైన జాజులు నలగులాబు
లల్లిబిల్లిగ నల్లిన మల్లెలాది

గలవు సంజీవనియు నుండు కాంతినిండు
పండు సర్వంబు హిమమిట నిండియుండు. ౭

సీ. పులిజాడ లివి కేసరులజాడ లివి సివం
గులజాడ లివి యేనుగులను జూడ
ఏనుంగు లివి జలం బానంగ నేతెంచె
నివి యెలుంగులును పేరెనుము లివిగో
కస్తూరిమృగములు గల్గుచుండుటఁ జేసి
విస్తారగంధంబు నెగడు నిచట
కాంచేభునకును గోష్ఠపందులు నియ్యవి
వందకందల లేళ్ల మంద లివిగో

గీ. యనుచుఁ బాంథుల సంభ్రమాత్యద్భుతముల
యందు ముగ్గంగఁ జేయుచు నిచట భిల్లు
లమలగంగాంబుకణపూర్ణ విమలహిమను
మారుతంబుల శ్రాంతివిదూరు లగుచు. ౮

సీ. ధాన్యసంపదలకుఁ దావులీ కొండలు
కొండ లీయవి † చూలు పండులీను
గంధకద్రవ్యంబు గల్గునీకొండలు
కొండ లీయవి ధాతుమండితములు
గైరికమదములు గల్గునీకొండలు
కొండ లీయవి ‡ చీడి కిందులగును

---

† చూలు = ఒక విధమగు పండు.

‡ చీడి = ఒక విధమగు దేవదారు చెట్టు.

భూర్జవృక్షంబులఁ బొల్చునీకొండలు
కొండ లీయవి రేగుపండు లిచ్చు
గీ. హిమము క్రిందను బచ్చిక లిచటఁగలవు
లవణ మిచ్చట దొరకు మేల్రాంకవముల
కివియె తావులు స్వర్ణంబు నిచట దొరకు
నంద్రు శిష్టులు హిమవనహార్యమందు. ౯

సీ. ఈ గంగ గోముఖం బెనసి భాగీరథి
యనఁగ భర్గుజటాళి నరుగుదెంచు
నీగంగ కేదారశృంగంబు నుండి మం
దాకినీనామంబునఁ బ్రవహించు
నీగంగ జాహ్నవి నాఁగ భోటా† నుఁ
దేశంబునుండి యేతెంచు నడిసి
ఈగంగ బదరీవనేశ్వరు నర్చించి
యలకనంద యనంగ నలయుచుండు
గీ. ననుచు గంగను గణియుపాయుల నచింత్రు
గంగ దయచేత మార్గంబు గలుగు నిచట
సంబరముఁ జూచుచును సేయునగ్గిగుల
యందు నయ్యాది లోఁతులోతుల ఘటించు. ౧౦

సీ. ఒకయెడ నాకాశ మొగియుచున్నంత వే
ఱొకవంకఁ గాతాళ మొనరఁ దాఁకు
ఒకదెసఁ గటికిరాళ్లకుఁ దావలంబు వే
ఱొకవంకఁ బచ్చిక కాన్కపట్టు

† భోటాను = టిబెట్టు దేశము.

ఒకచాయఁ గమ్రతాపికిఁ దాసకంబు వే
ఱొకచాడ శీతలోదకనిధాన
మొకయెడ పొదరిండ్లకు నివాసమును వే
ఱొకదెస పెనుమ్రాకులకును నెలవు

గీ. ఒక్కయెడ మంచుగడ్డల కిక్క సురభి
మందశీతలవాతాసీనం బొకయెడ
నగుచు గంగాప్రవాహంబు ననుగమించు
పాంథసంసేవితము హిమవత్పథంబు. ౧౧

సీ. ఇదెవ్యాసగుహ యాతఁ డిందె సూత్రప్రకృతిఁ
దాల్చియుండునటంద్రు తత్త్వజనులు
ఇదె ముచికుందునిసగన సాంద్రతానికి
నచ్యుతుం డిటనె ప్రత్యక్షమయ్యె
ఇదె జామదగ్న్యుని గూఁడనైసర్గికొం
డింకను నచటను వసించుచుంద్రు
ఇదె బదర్యాశ్రమం బిందె తపోవృత్తి
సల్పెరి నారాయణుండు నరుఁడు

గీ. నిదియె కేదారమను శృంగ మిందు హరము
సలిపి తప మాచరించెను శంకరుండు
నింకను వేలును లక్షలు నిట్టితావు
లన్నివివరించి తెలుప నా కలవియగునె. ౧౨

సీ. ఆతపంబును శీతమను నెడు భేదము లేక
ఋషులు తపం బాచరింతు రిచట

ఆకలి తృష్ణయు నన్న నెఱుంగక
ఋషులు తపం బాచరింతు రిచట
ధ్యాతయు ధ్యేయంబు నను భేదము లేక
ఋషులు తపం బాచరింతు రిచట
అహమును రాత్రియు నన్న నెఱుంగక
ఋషులు తపం బాచరింతు రిచట

గీ. శాశ్వతబ్రహ్మవృత్తిని జడులువోలె
నుందు రత్యద్భుతంబుగ యోగు లిచట
యక్షకిన్నరగంధర్వులాదిగాగ
దేవతల కిది విహరించుదివ్యభూమి. ౧౩

సీ. గంగలో నుండియు వెంగలు లయి తిరిం
పంగఁజాలని జంతువారముల్లు
కొలనిలోపల నుండి కలువలమధువును
గ్రోల నేరని భేకకులమువోలె
దేవాలయంబున సేవఁ జేయుచును దో
సములను సల్పు నర్చకులభంగి
ముక్తులకడనుండియు ముక్తిపథంబు నా
సక్తిఁ గోరని మూఢజనులభాతి

గీ. మణులవ్యాపారములఁ జేయు వణిజులవలె
నిధులకడనుండు రక్షకనిచయముల్లు
శ్రీమహేశుని శిరసునఁ బాములవలె
భిల్లు లీపుణ్యభూమి వర్తిల్లుచుంద్రు. ౧౪

## ౨. గంగోత్తరలోయ



ఉ. పాలసముద్రమో యనఁగ
భాసిలు కౌముది నాఁగ దివ్యగం
గాలహరీమనోహరను
కాంతివితానమనంగ నిర్మల
శ్రీల నొసంగు నీశ్వరు శ
రీరరుచిప్రకరంబునాఁగ ది
గ్జాలము నిండుకొన్న ఘన
సారము నాఁజను గోముఖంబటన్. ౧౪

ఉ. అంతటఁ జెన్నుమీరు ధవ
ళాకృతి చుట్టువెలుంగఁ గన్న ల
త్యంతము విభ్రమంబుఁ గొన
నల్లల భాస్కరుభానుసంఘముల్
వింతగ నాట్యమాడుచును
వేడుకఁ జూప విచిత్రవర్ణముల్
మంతనమాడ మేఘతతి
మానితగోముఖశృంగ మొప్పెడిన్. ౧౫

ఉ. చల్లని గాలివీచు మఱి
చల్లఁదనంబున నీరు స్ఫాటి కా
త్యుల్లసదాకృతిం గనును
నల్లము జల్లను నుత్కటంబుగా

వెల్లువగాఁగ గోముఖ సు
　　విస్ఫుటకాంతు లనాదినుండియుం
బెల్లుగఁ బేరిగడ్డలయి
　　మించును మంచు తళత్తళచ్ఛవిన్. ౧౭

ఉ. తెల్లని గోముఖం బమృత
　　దీధితులీను కెంపుశృంగముల్
పెల్లుగ నాకసంబు నగ
　　లించెడు లాగునఁ దోచుచుండ మే
నెల్లను భస్మలేపన స
　　మృద్ధతఁ దేజరిలంగ నూర్ధ్వబా
హూల్లసదాకృతిం దనగు
　　యోగియునాఁ దనరారుచుండెనున్. ౧౮

ఉ. ఇమ్మహి నెల్లలోకులు త
　　రింపగ వారల ఘోరపాప పం
కమ్ముఁ దొలంగఁ జేయుటకుఁ
　　గా జలరూపముఁ దాల్చినట్టి గం
గమ్మను గోముఖంబు తన
　　మానసగహ్వరమందు వెల్వడన్
సమ్మతిఁ జేయు దృశ్యమును
　　సారెకు భక్తనిగాంత్రు యాత్రికుల్. ౧౯

ఉ. అక్కడనే కృపాకలిత
　　యోచును లోకుల పాపసంచయం

బొక్కట రూపుమాపఁగ ను
హూర్గతి వెల్వడి గంగ తీవ్రస
మ్యక్కలితార్భటిన్ గడు ర
యంబున నొంకృతి నిష్ఠురంబుగా
దిక్కులఁ బర్వఁజేసె ను
దేవత లబ్బురమంది చూడఁగన్ ౨౦

ఉ. కొండలఁ గొండలన్ దుముకుఁ
గొండలఁ గొన్నిట గంగ లీలమైఁ
బిండియొనర్చి మార్గము న
భీప్సితభంగిని సల్పు గొండలం
దండలఁబోలెఁ గూల్చు ఝరి
యందునఁ గొన్ని మహీధ్ర శృంగముల్
చండత నిండుయౌవనము
సాఫలముండు శైశవంబునన్ ౨౧

ఉ. గంగను దాటఁగా వశము
గాదు నిరంతరదుస్సహార్భటి
సంగతభంగసంఘము ల
సంఖ్యములై చెలరేఁగెడున్ నదీ
తూరంగము సన్నమయ్యెను ర
ణాంగణ మధ్యమునందుఁ జొచ్చు వీ
రాంగనఖడ్గమట్లుగ భ
యానక మెవ్వరు బోదు రడ్డమై. ౨౨

ఉ. ఘోరవిషంబు వెల్వఱచు
క్రూరమహాహియో దారుణంబుగాఁ
గోరలఁ జూపుఁ బెబ్బులియొ
ఘూర్ణిలు మత్తగజేంద్రమో మహా
పారతరంగసంతతులఁ
బర్వెడు సంద్రమొ కాళరాత్రియో
నా రయ మొప్పఁ గన్పడు స
నాదరముం బెలిఁబుచ్చువారికిన్. ౨౩

ఉ. వందనముం బొనర్చి బహు
భక్తిని మజ్జన మాడువారితో
మందమృదూక్తులన్ బలుకు
మంజులఘోషను గంగ పాపముల్
చెందవు మిమ్మటంచును వి
శేషముదం బొనగూర్చు నాకృతిన్
జిందులఁ ద్రొక్కుచుం బఱచు
శీఘ్రతరంబుగ గోముఖస్థలిన్. ౨౪

చ. ఇటువలెఁ గొంతదూర మతి
హృద్యముగాఁ బ్రవహించు గంగ త
త్తటములఁ బొల్చు భూర్జములు
తత్తరుకాండజ పత్త్రసంతతుల్
చటుకునఁ దీసి లేఖలను
సల్పెదు రందురు యక్షకన్యకల్.

పటుతరవృత్తి మంచుల
శుభస్థితి నయ్యావి వృద్ధిఁ బొందెడున్. ౨౫

ఉ. వీనికిఁ దోడఁబుట్టువులు
వెల్వడు నీవల దేవదారువుల్
పూనిక మంచులందు పనిఁ
బూని సహించుచు శీతవాతసం
తానపరంపరల్ విపుల
ధైర్యగుణప్రతిభాప్రదర్శకా
మ్లానవిశాలశాఖల స
లంకృతిసేయు మహీధ్రశృంగముల్. ౨౬

ఉ. పుల్లలు ఱాగడా లగును
బొందుగ మ్రాఁకులు వంటకట్టెలౌ
భిల్లుల కాతమప్రసవ
విస్ఫుర కేసరముల్ హారిద్రమౌఁ
బెల్లుగఁ జందనాగరుల
పేర్మిఁ దనర్చును వానిఖండముల్
చల్లనికప్పురంబగు ర
సం; బుపకారులు దేవదారువుల్. ౨౭

ఉ. ఈవిధివచ్చి జాహ్నవి య
హీనమహాత్వవిభూతితోడఁ దా
నావనముల్ వడిన్ గడిచి
యంతటఁ జేరును నొక్కలోయఁ దీ

ర్థావళి కేఁగుమానవులు
దానిని గంగకు నాది యండ్రు, తా
రేవగ గోముఖంబునకు
నేఁగఁగఁజాలక యందు రీగతిన్. ౨౮

మ. ఇది గంగోత్తరయంచు జాహ్నవికి ని
ద్దే యుత్తరంబంచు ని
య్యది భాగీరథి తద్భగీరథున తా
త్మాకారముం జూపెఁ ద
ద్విధి సందేహముఁ దీఱనంచు నిదియే
శ్రీగౌరికిన్ గుండమై
నదిగా! యంచు సపారభక్తియుతులై
యర్చింతు రీస్థానమున్. ౨౯

చ. ఇటఁ గలకాలమున్ నిలిచి
యెందఱు మౌనులు సిద్ధి నొందిరో
యిటఁ దపముం బొనర్చి మఱి
యెందఱు మున్ శ్రుతులన్ గ్రహించిరో
యిట నిరతిన్ వసించి ఋషు
లెంద ఉమేశునిఁ గాంచఁ గల్గిరో
యెటుల వచింప శక్యమగు
నీమహనీయపరప్రభావమున్. 30

చ. వినినను దత్ప్రభావములు
వీనులవిందగు శాంతి నిచ్చుచున్

మనసముఁ జేసినన్ మన మ
మంద సుఖాంబుధి నీఁదులాడెడుఁగా
గనిన వసూనసమ్మాదము
గ్గి మ దస్రులు జాలు వాఱు నం
దనిశనివాసులౌ ఋషుల
మూర్తుల కెంతటి హర్షమోఁగదా! ౩౧

చ. సనకసనందనాదిముని
చంద్రుల కాలము గుండె యిచ్చటన్
వినుతవసిష్ఠ గౌతముము
ని ప్రవరాదుల నాఁటి గుండెయున్
మినమను సేక మౌనటులఁ
మోఁటి వెలుంగు తపస్సు తేజమే
యనయము మూర్తిరీతిగ న
నంతసుఖం బిడు స్పందనం బగున్. ౩౨

౩ బో ధి గు హా బా హ్య ము .



క. ఈవిమలంబగు లోయను
దా వెలయుచు నొక్కగుహ యుదాత్తము విలస
ద్భావుఁ డొకజ్ఞాని దానికిఁ
గావించెను బోధినామకరణముఁ బ్రీతిన్. ౩౩

ఉ. గంగయు బోధిసంజ్ఞగల
కందరవుందరి సంచరించునా
మంగళశీల స్వాగతము
మందసమాదగ వృత్తి నిచ్చు; దా
యంగను నెల్లవర్ణముల
కంతిమెగాక సమస్తజాతులన్
రంగుగఁ జూచు నొక్కగతి
రమ్యముగాఁ బ్రణవంబుఁ బల్కుచున్. 38

ఉ. భిక్షు లభించు మానిగణ
విశ్రుతసంతతికెల్ల గంగ కి
ర్పతుములందుఁ బల్లెలను
భక్తి మహోత్తరమ్మొ రహింపఁ దా
మక్షయరీతి వడ్రసస
మంచితభోజన మంగనామణుల్
మోక్షముఁ గోరి పెట్టెదరు
మ్రోగఁగఁ గంకణముల్ కరద్వయిన్. 39

శా. ప్రాతఃకాలమునన్ హిమాద్రిశిఖర
ప్రాంతాతిశీతంబులౌ
వాతంబుల్ మెలమెల్లవీచుఁ దరువుల్
వర్ధిల్ల గంగాకణ
వ్రాతంబుల్ గొనివచ్చి యావిరు లటన్
వాసించు సాధూత్తముల్

ప్రాతఃస్నానము లోంహ గా హరహరా
రావంబులన్ జేయఁగన్. ౩౬

ఉ. వాయువుచేతనే శుచిత
వర్ధిలుచుండఁగ స్నాన మేల వే
తే యని కొంద అంద్రు యతు
లిచ్చట సర్వమలాపహంబు భ
ద్రాయితమావిభూతికిని
దక్కువ యన్ని యటంద్రు కొంద ఱా
హా; యిఁక బ్రహ్మభూతులకు
నక్కఱయుండునె యెట్టి స్నానమున్. ౩౭

శా. మధ్యాహ్నంబున నెండయుం జలియు న
మ్యగ్నిల మిశ్రంబులై,
సుధ్యానంబున బ్రహ్మతేజమును ద
త్సాత్మ్యంపువ్య క్తిత్వమున్
మిధ్యాచింతలు మానుపట్టునను స
మ్మేళంబు తోనట్టివె
సుధ్యానందకరంబులో నెపుడు న
చ్చో హైమశైలంబునన్. ౩౮

శా. సాయంకాలమునందుఁ బయిపయిని భా
స్వద్భానువుల్ పర్వ యా
త్రీయచ్ఛాయలఁ జిత్రవర్ణపటముల్
దీపింపఁగాఁ జేయుఁ బ్రా

లేయోర్వ్యధరశృంగ మేఘతతిఁ ద
 ల్లీలాత్తవర్ణంబులన్
మాయం జల్పు విచిత్రరూపములు బ్ర
 హ్మాం బిట్టులే యన్నటుల్. ౩౯

ఉ. రాత్రులయందు వ్యాఘ్రనిక
 రంబులు సింహము లొక్కచోట్లనన్
గోత్రవిభేదకంబుగ న
 కంఠితగర్జలు సల్పుచున్న నే
యాత్రము లేక బోధిగుహ
 ప్రాంతము లొప్పఁ బ్రశాంతవృత్తిమై
సత్త్రిగుణస్వభావములు
 దాఁకని యోగుల యాత్మలుంబలెన్. ౪౦

సీ. మింటికెక్కి యెగసిన మేఘసంఘాతంబు
 ఘృణ్యావితానంబు బోధిగుహకు
అడుగునఁ గప్పట్టు నంబుదప్రాంతంబు
 మఖ్యాసోపానంబు బోధిగుహకు
గాలి, ద్వారమునొద్దఁ గదలు మేఘావళి
 పొలుపారు పెండెము బోధిగుహకు
శిరసునఁ గనుపట్టు శరదంబు లభిషేక
 పూర్ణకుంభంబులు బోధిగుహకు

గీ. హిమము వర్షించు మేఘసంఘము సుపుష్ప
 చయ సమర్చన సేయు పూజరిగణంబు

గాంగఁ దాపసులకు బోధికందరంబు
సంతతానందదాయియై యింతఁ గొలువు. ౮౧

సీ. ఎంతటిపుణ్యంబు నెట్లు చేసెనొ బోధి
గుహయాహ నాధార మీకొండ యయ్యె
ఎంతటిసుకృతంబు నెఱిఁగి చేసెనొ బోధి
గుహ కితరుల్ బంధుకూటమయ్యె
ఎంతటిశుభ కార్య మెట్లు చేసెనొ బోధి
గుహకు నీర్ఝరి యనుంగుఁజెలి యయ్యె
ఎంతటితపము మున్నెట్లు చేసెనొ బోధి
గుహ కీస్థలము జనిక్షోణి యయ్యె

గీ. ఎంతటియదృష్టమో బోధప్రాంతమందు
సంచరించెడు నీజంతుసముదయంబు
నేమి చెప్పంగవలె మాయదృష్ట మంద్రు
భువనభూషణమునుఁ జేరి బోధిగుహను. ౮౨

చ. కపిలలగోవు లచ్చటను
గానఁగవచ్చును మందమందలై
యుపరిమితానురాగమున
సంతతిఁ గ్రేపుల నాకిరొంచుఁ జే
వు పొదుగులన్ స్రవింపగను
బొంగుచు నమ్మలు కామధేనువే
కృపనిట నిన్నిరూపులు ధ
రించి చరించెను నట్లు దోఁపఁగన్. ౮౩

ఉ. పేశలమైనరోమసులు
పృథ్విని దాఁకఁగ లేళ్లమూదిరిన్
లేశము శ్రాంతిలేక యవ
లీల గిరీంద్రము లెక్కు మేషముల్
పాశ(పు)వ్రేళ్లు గాంచ కవి
బర్వెల మోయును గొండదారులన్
గ్లేశముఁ జెందు నెండలకు
క్షీరము లిచ్చును గోవులుంబలెన్. ౪౪

చ. ప్రకృతియె బంధు పిచ్చటను
బల్కినఁ బల్కక యున్నగాని యా
ప్రకృతియె మోదదాయకము
భావమునం దెటులున్న గాని త
త్ప్రకృతినిమగ్నులై తుదిని
ప్రాకృతివృత్తిని దాఁటి సాధకుల్
ప్రకృతివిహీనవస్తువను
భాసిలుచుందురు తత్త్వవేత్తలై. ౪౫

ఉ. బ్రహ్మమయంబు లాట లిట
బ్రహ్మమయంబులు పాట లీయెడన్
బ్రహ్మమయంబు కార్యములు
బ్రహ్మమయంబులు భావసంపదల్
బ్రహ్మమయంబు వృత్తు లిట
బ్రహ్మమయంబులు సర్వసంగముల్

బ్రహ్మమయుల్ మహామహులు
బ్రహ్మవిలీనత నుందు రిచ్చటన్. ౪౬

శా. ఏనాఁ డిచ్చటి కేఁగుదెంచి గుహఁ దా
నీక్షించె బ్రహ్మర్షి యా
జ్ఞానానందమహాత్ముఁ డీగుహకు నే
నాఁ డుంచె బోధ్యాహ్వయం
బేనాఁ డిచ్చటఁ దన్మునీశ్వరుఁడు వ
ర్తించెన్ బరంబ్రహ్మమై
యానాఁడే చరితార్థ యయ్యె గుహ య
త్యంతంబు పూజార్హమై. ౪౭

శా. ఏసంకల్పముచేతఁ జేసెను తపం
బేకోరికల్ లేనివాఁ
డేసద్విగ్రహ మర్చఁ జేసె నతఁ డిం
దేభావమున్ లేనివాఁ
డేసమ్యగ్గుణవృత్తి నుండె గుహ నిం
తే నిర్గుణుండైనవాఁ
డేసన్మోక్షము నాశ్రయించెనొ యతం
డే మోక్షమై యుండియున్. ౪౮

ఉ. ఏ లనుమాన మేన వచి
యింతును గల్గినమాట గట్టిగాఁ
జాలఁ దరింప లోకములు
జ్ఞానమునన్ బరమర్షి నిర్మల

శ్రీలఁ దనర్చు రూపమునఁ
జెన్నగుబోధిగుహాంతరంబు శ్రీ
యాలయమై యెసఁగఁ గరు
ణాకృతి నిచ్చెను "బూర్ణసూత్రముల్." ౪౯

ఉ. ఆఁకనిస్వచ్ఛకీర్తులయి
యంతటఁ జిమ్ముచుఁ గమ్మవాసనల్
శ్రీ తనరన్ దనర్చు బహు
రీతులఁ నొప్పెడు మల్లెపూలు బ్ర
స్ఫీతమనోహరాకృతుల
విశ్రుతమాధురిఁ జాటుచుండు వి
ఖ్యాతఫలావళుల్ ఋషిహృ
దంతరసాధుమనోజ్ఞభావమున్. ౫౦

౭ బోధి గుహా వ ర ణ ము.



క. రెండు వనజ్యోత్స్నలు కా
వుండును ద్వారంబుచెంత సాజ్ఞితవృత్తిన్
నిండువికాసముతోడను
మండనములు గుహకు నగుచు మానితవృత్తిన్. ౫౧

గీ నిండుచీఁకటిరేల నీరెండులసలు
వెన్నెలలుగాయు నట్టులు వెలుఁగుచుండ

మెండుకొను ప్రేమ నీగుహా యందు జేరి
దంపిగా నాడుచుండును గండుపులులు. ౫౨

ఆ. వె. సింగ మెలుగు లేడి సివ్వంగి తోడేలు
నెమలి పాము పిల్లి నిత్యవైరి
మృగము లిటకు వచ్చి మ్రొక్కు యోగీశ్వరుం
డుంచు కరకమందు నుదక మాను. ౫౩

క. సందెలరాగం బెనయుట
సిందూరప్రభలు గలుగ జేయగ జ్యోత్స్నల్
పాండిక గంధర్వాదులు
డెందంబుల నలరుచున్ నటించెద రచటన్. ౫౪

శా. అతుల్ దన్పుకు భూషణావళులతో
హారిస్వరూపంబుతో
నక్షీణాగురుధూపవాసనలతో
నవ్యాహతభ్రూలతా
విక్షేపంబుల శోభితన్ మకరికా
విఖ్యాతపత్రాళితో
యక్షస్త్రీలట సంచరింత్రు ప్రియభ
ర్త్రాసక్తచిత్తంబులన్. ౫౫

క. జంటలుగా గుహ్యకులా
వెంటను గింపురుషు లిట్లు వేలుపు లెల్లన్
మంటిమి జన్మము ధన్యము
గంటిమి బోధిగుహ యటంచు గావింత్రు నతుల్. ౫౬

ఉ. బోధిగుహామహత్త్వము సు
బోధవిశారదుం డైన తత్త్వపో
నాధు మహత్త్వమో యిది య
నంతవికాస మొసంగు నోషధీ
సాధుమహత్త్వమో ప్రణవ
శబ్దనగాంగమహత్త్వ మొక్కొ వి
ద్యాధరసిద్ధసాధ్యసక
లామరసంఘు మిట్లు జరించెదున్. ౫౭

సీ. మేను మేనునఁ జేర్చి మృదువుగా నిమురుచు
నాదరించెడునట్లు లప్పు డప్పుడు
చెవిఁజేరి నిక్కు నచ్చెగావుగా గుహ్యంబుఁ
జెప్పి రంజించున ట్లొప్పు చొకటఁ
జెక్కిలిఁ దాకుచు జేరి ముద్దాడి స్వ
ప్రేమంబుఁ దివిరి చూపించునట్లు
శీర్షంబుఁ దాకను జనుకుచు హిమకణా
వలి నభిషేకంబు సలుపునట్లు

గీ. చిక్కఁ బదముల భక్తిని మ్రొక్కునట్లు
మించు దీవియ లట్టె మెఱయు జ్యోత్స్న
లామహాయోగి చను దెంచి యాదరించి
చెంతఁ గూర్చున్నవేళ నత్యంతరక్తి. ౫౮

మ. చిరుచేమంతులు మోముల౯ హిమకణ
శ్రీమోదబాష్పంబు ల

బ్బరమై పర్వఁగ హేమకాంతులఁ దరన్
బుష్పాళులన్ విచ్చి సా
దరపుంజాఫలఁజూచి పుష్పాదుల గం
ధంబుల్ వెదంజల్లు చి
ల్లరుదా స్వాగత మిచ్చు బోధిగుహ దా
యన్ వచ్చు సిద్ధాళికిన్. ౫౯

చ. దమనము లెల్ల వేళల ము
దంబునఁ బోలెను దావిఁ దాపసో
త్తమునకు ఘ్రాణతర్పణము
దా మొనరించుచునుండ నాత్మమో
దము గనుచుండుఁగాని యవి
తాకడు కందునో యంచు హింససే
యమిదె వ్రతంబుగాదె పర
మార్థవిదుండగు యోగిమాళికిన్. ౬౦

ఉ. తాలికిఁ గ్రిందుగా నెసఁగు
గడ్డిని జూడక త్రొక్కి యయ్యయో
కాలవశంబుగా నిటులు
గల్గెను హింస యటంచు దత్తృణం
బుల్ లలితంబుగా సరిది
పోసెదు మౌనులు మూఢచిత్త మ
ర్త్యాళియుఁబోలెఁ బూజ కని
యూనడిఁ బుష్పములన్ గ్రసింతురే. ౬౧

ఉ. చెట్టునఁ బూవు చక్క విక
సింపగ మానస మంతనింతు నా
చెట్టనకున్ సుఖం బగును
జెన్కని వో నవె రాలిపోయెదున్
జెట్టనెనంబునన్ జగలు
చెట్టులయంగము కన్నులాగ ను
న్నట్లాలు చూడలేక పువు
లక్కట పొట్టను బెట్టికొందురుగా ౬౨

గీ. ఓమహారాజ కనుగొను మోము పఱపు
లివ్వి శయనింపు మని యటఁ దృణము పఱగు
బుషులశయ్యకుఁ గొసవచ్చు నెందుగక్కి
పచ్చగడ్డినిగని ముదంపడఁగవలయు ౬3

ఉ. ఆవరణప్రదేశ మిటు
లద్భుతమయ్యెదురీతి నృపసం
భావితదివ్యనందనము
భాతి విరాజిలు నీతిబాధలున్
గావిట యోగికిన్ జెలిమి
కాంద్రుడు దగ్గఱబంధువర్గమై
యావిమలంపుభూజములై
యాయనకున్ గలిగించు మోదమున్. ౬౪

# ౫. బోధిగుహాభ్యంతరము



గీ. బోధిగుహా, లోనఁ దశ్శ్వపాడవు ; దాని
యెత్తు కొంచెము ; నిలుచుండ నిమ్ముగాదు
ఐహికసుఖార్థిభోగుల కద్ది తగదు
బాగు పద్మాసనస్థులౌ యోగులకును. ౬౫

చ. గుహాయనసేమొ భావమునఁ
గొందఱు తప్పుగాఁ దలంతు రా
గుహాలను స్వేచ్ఛమై మనలు
కొంటకు నిష్టవిహారలీల
న్విహాము నొనర్చుకొంటకు న
నర్హమటంచని యెత్తు రక్కటా
మహితవివేక మిట్లనెడు
మానవకోటికి నెప్డు గల్గునో. ౬౬

క. గునకర్థ మంధకారం
బును "హా" యన నాశకంబుపొందుట నీరిం
దును నంధకారనాశక
మనితోచుంగా గుహాపదార్థం బరయున్. ౬౭

చ మహానను చంద్రు కొందఱిటు
మానులమంచును ముక్క మూయుచున్
గుహాలను సోమరుల్ గలరు
కొంచక లోకులనింద సేయుచున్

విహితములైన కార్యముల
వీడుచుఁ గొంచును నంతె కాని త
న్మహిమముఁ దత్వముం గన న
మర్థులుగా చెటువల్కు మానవుల్. ౯౮

ఉ. కర్మమె గొప్ప దండ్రు తమ
కర్మముచేతనె బ్రహ్మమందు స
న్నిర్గలవృత్తిమైఁ గలయ
నేర్తు మ టందురు జ్ఞానయుక్తులన్
గర్మమె చేయువారమని
కాలులుఁ బల్కుదు రైనగాని త
న్మర్మ మెఱుంగ కూరక యె
మానులు చేరుదు రా ? గృహస్థులిన్. ౯౯

ఉ. తత్వ మనంగ నేమొ సర
తత్వము లుండునో యెన్ని నూపులఁ
దత్వ మెఱుంగ నేగఁదగు
ధర్మపథంబులు నెవ్వి యో యెటుల్
తత్వము వేదశాస్త్రములఁ
దజ్ఞులు తెల్పిరో కానకుండ దు
స్తత్వము లన్యధర్మముల
సంగతిమై వచియింత్రు దుర్మతుల్. ౧౦౦

మ. భయమున్ గూర్చెడు నన్యధర్మములకే
ప్రాధాన్యముం జూపు చ

ధ్యేయసంబున్ బోనరించి స్వీయ మగున
ధర్మంబు పూర్ణంబుగా
నయ మొప్పన్ గనఁజేసినట్టి ప్రజ కాజ్ఞా
నంపె ప్రజ్ఞాపహా
మయమై వర్తిలు కెంటికిం జెడును రా
మూర్తుల్ సదావిష్టులై. ౨౦

ఉ. వ్యాసశుకాదిసత్తములు
వల్లనె భారతీముఖ్యకావ్యముల్
భాసిలె లోకమందు మును
వాల్మికి యుట్టిఁడె గాఁడె లోకసం
త్రాసకర హ్వాసర్థమునుఁ
దప్పక మాన్పనె క్షుంభగాదు లే
నాసము లొగహోలిగన ;
వారికి లోపము సంభవించెనే ? ౨౧

ఉ. స్వార్థపరుల్ నగర్భులు వి
శంకతఁ జల్కుదు రల్పవాక్యముల్
వ్యర్థులు లోకు లాగతిసె
వాదము సేయుదు రల్పబుద్ధి మో
హార్థవివేకవంతులు స
మర్థులు తాపసు లేడ నల్పభా
వార్థవిలోలు లజ్ఞులగు
నట్టిరుపీరలు నేఁడ నెన్నఁగన్. 23

ఉ. ఆదియనంతమై విమల
మై యఖిలాస్పదమై యనాద్యమై
మోదసురూపమై గుణవి
ముక్తమునై నిరతప్రదీప్తమై
భేదవిహీనమై యఖిల
విద్యకవిద్యకు మూలహేతువై
వాదవిదూరమై వెలుఁగు
బ్రహ్మ మఖండచిదాత్మభాసమై. ౨౪

శా. కాదవ్యక్తము నామహత్తును నం
గా దద్దహంకారమున్
గా దాబ్రహ్మము బుద్ధియుఁ మనమునున్
గా; దద్దిచిత్తంబునున్
గా; దేలీలను బంచసంఖ్యగల త
న్మాత్రల్ మహాభూతముల్
గా; దానిర్మల మానసేంద్రియములున్
గా; దన్య మన్నింటికిన్. ౨౫

ఉ. నాస్తియటంచుఁ బల్కుటకు
నయ్యది సాక్ష్యముఁ గాద యేరికిన్
నాస్తియటందు రెవ్వరటు
లాడెడు నాత్మ యొకఁడు లేనిచో
నాస్తియనంగ నెట్టులగు
నాత్మవిఘాతముగాదె నాస్తితన్

నాస్తియటంచు, శత్వగ ము
సంశయగా స్థిరవృత్తి నిల్వదే. ౨౬

ఉ. రజ్జున సర్పభావమును
రాజతభావము శుక్తి నెట్టుల
త్రిజగమెల్ల భాసిలెడు
నేర్పడి బ్రహ్మమునం దవిద్యచేన్
సజ్జను లాయవిద్యయను
సంశయమంబును జ్ఞానదీప్తిచే
సజ్జనసేను బ్రహ్మము స
ముజ్వల తేజమునన్ గనంబడున్. ౨౭

ఉ. మాయయు జన్మమృత్యుయుత
మస్త్రశరీరము గాంచి యంతటన్
మాయం దరింపలేక భవ
మగ్నులు సంతతదుఃఖపూరితుల్
మాయయు భ్రాంతిసంయుతులు
మానవ్యమునం గృశించుచున్ మూఢులీ
హేయవిమోహసంసృతి దు
రేషణముల్ కడుబాధ సేయఁగన్. ౨౮

ఉ. ఈభవవార్ధి నెల్లపుడు
నెందఱో మున్గుచు నున్నవారలై
యాంధ్యదస్థితిన్ గనియు
హీనులు జీవితకాలమెల్ల మా

కేభయ మానవహిల్లదని
యెంచుచు వర్తిలుచుందు రెల్ల యా
హా! భవపాశబద్ధహృద
యస్థితు లక్కటా! యిట్టివేగదా. ౪౯

ఉ. నాలుఁగురీతులన్ జనము
నన్ గల తత్త్వము తద్గుణాలచేఁ
గ్రాలును వేఱు వేఱుగను
కర్మము ధ్యానము జ్ఞానభక్తులై
కాలము దేశమున్ గని య
ఖండితవృత్తి సమగ్రసాధనం
బోలి నొనర్చు మానవుల
కున్నతఁపుంగతి నొందగా నగున్. ౫౦

ఉ. ఎల్లర కొక్కతత్త్వమును
నేకమె యోగమునంట కల్గ యా
నుల్లమునన్ నిజార్థమగు
యోగముఁ బూనక యుండునట్టి వా
రెల్లరు గమ్యమున్ గనక
యే, పెడత్రోవనఁ బోవుపాంథులై,
పొల్లుగ నెన్నొజన్మములఁ
బూని వృథాశ్రము లొందురేగదా. ౫౧

మ. యమమున్ నీమము నాసనంబు మఱి ప్రా
ణాయామమున్ ధ్యాన ము

ధ్యమ మొప్పన్ ధరియించి ధారణము ప్ర
త్యాహారమున్ గూడగన్
విమలంబైన సమాధినుండ గుహలే
విశ్వంబునం దర్హముల్
భ్రమ నిండ్లన్ సలుపంగ యోగముల నా
పత్తుల్ ఘటిల్లున్ జుమా. ౧౨

ఉ. వృత్తుల నన్నిఁటిన్ దఱిమి
రిత్తమనంబును గూడఁ బాసి య
త్యుత్తమరీతి నస్థితను
నూర్జితవృత్తిఁ ద్యజించి యద్వయా
యత్తముఁ జేసి యాత్మఁ గడు
నబ్బురమౌనటు బ్రహ్మ తానయై
యుత్తముఁడైన యోగి వెలుఁ
గొందెడు నల్పు లటుండ నేర్తురే. ౧౩

ఉ. ఏము తరింపఁగాఁ దలఁచు
మిందుల నుండఁగఁ గాలమంచు ని
ష్కామతనైన ముముక్షు లగు
సత్పురుషాళికిఁ దత్త్వనిర్ణయం
బాసహితాత్ము లాదిమును
లద్భుతశక్తిని వేదరూపతన్
బ్రేమను సల్పి రీవిధము
వేమఱు బోధనుచే నెఱుంగనే. ౧౪

ఉ. తుచ్ఛసుఖంబులన్ దొఱఁగి
తూర్ణముగా నిలువీడి బంధముల్
స్వేచ్ఛను ద్రెంచి యోగమున
నీప్సితసాధనమున్ బొనర్పఁగా
నిచ్ఛఁగలట్టిమానవుల
కిద్ధర నద్రిగుహాళి శ్రేష్ఠమా
స్వచ్ఛనివాసముల్ మిగులఁ
సాహస మాగుహానింద సేయుటల్. ౮౫

శా. ఈసంసారపుబాధతోడ గృహమం
దేయుండి ముక్త్యర్థమై
యీసంబైనను జేయు దుర్ఘటము త
ద్విస్పష్టమా చిత్రముల్
కాసంతల్ గనుదోచి వృద్ధిఁ గనుచున్
గారించు దేహంబు నెం
తో సంతోషము భావశాంతి గుహలం
దుఁ గల్గు నేకాంతతన్. ౮౬

ఉ. కంచె గలట్టిమొక్కకును
గల్గును సేమ మదుండ దేనియుఁ
గొంచెపుమేని రూపము మి
గుల్ గనకుండను మేయు జంతువుల్
మంచి గుహానివాస మొక
మర్త్యునియున్నతజీవనంబుకై

యంచితదక్షిణాంబు విష
యావళి బారికిఁ దప్పుకొంటకున్. ౮౭

ఉ. కావున నేకతంబున స
కారణభక్తిని నిశ్చలంబుగాఁ
బోవిడి లోకముఁ గుహకుఁ
బోయినవారిని నింద సేయఁగాఁ
బోవు టనర్థమే యగును
బుణ్యతమంబగు మాతృభూమియం
దావిధమైన యోగమున
నద్భుతశక్తులు భారతప్రజల్. ౮౮

మ. ఒకసంకల్పముతోడ నుండి జగముం
దోంకారభావంబుతో
సకలంబుం గనఁగల్గు లోకముల క
ష్టంబుల్ స్వతేజంబునం
వికలంబుల్గ నొనర్చు నేను మిషఁ ద
ద్విఖ్యాతసద్వృత్తిచే
నకలంకుం డగుయోగివర్యుఁడు మహా
సంసాత్త్వికుం డల్పుఁడే. ౮౯

చ. గురువరుఁ డిచ్చు నాపనము
గోప్యమహాత్తరలక్ష్యభావమున్
గురుతుగ నొక్కచక్రమునఁ
గూర్చి యచంచలభక్తియుక్తుఁడై

యురుదగు శక్తికుండలిని

యద్భుతరీతి సహస్రపత్రముం

దు, రహి వెలుంగఁగా నఘవి

దూరుఁడు తాపసి యుండుఁ ద్రుమాన్. ౯౦

గీ. బోధిగుహ పుణ్యగుహయయి పొదలి యోగి

పుంగవాళికి నావాసముగఁ దనర్చి,

విశ్వమోక్షార్థకల్యాణవిభవమునకుఁ

గారణం బగు నాచంద్రతారకముగ. ౯౧

# మానవోదంతము *



సీ. శ్రీవత్సలాంఛనాశ్రితరత్నకంఠుఁడు స
కలచరాచరవిశ్వకారణుండు
పరమాత్ముఁ డుత్కటప్రళయపాథోధిని
వటపత్రశాయియై బాలలీల
కుడిపదాంగుష్ఠంబుఁ గుడుచుకొనుచు నుండ
నబ్బాలు నాభితోయజమునందు
జనియించి శారదాసహితుఁడై విధి వేద
మంత్రరాజములఁ జిన్మయునిఁ బొగడి

గీ. దేవ! భవదీయ మైన యాదేశములను
దివ్యసంకల్ప! ఘటియింతుఁ దెల్పు మన ని
ఖిలచరాచరరూపసంకీర్ణ జగము
సృష్టి సేయంగఁ బరుఁ డాజ్ఞ సేసె నంత. ౧

సీ. మొదలఁ బ్రళయమహాంబుధుల నింకించి త
ద్బ్రహ్మాండభాండంబు బయలు వఱచి
మిట్టు పల్లంబులు మేరలు తెలియఁ జే
సి గిరుల నదుల విశేషముగను

---

* ఇందు నన్నయభట్టారకునియతిప్రాసనియమముల ననుసరించి పదునాలుగువిధములగు సీసపద్యములు గలవు.

నిర్మించి తరులతానివహంబుతో మృగ
పక్షికీటంబు లపారజాతు
లగునట్లుఁ గల్పించి యఖిలసురాసుర
యక్షగంధర్వాద్యనంతసృష్టి

ఆ. యందు మనుజలోక మమరు జాతుర్వర్ణ్య
సహితముగను గూర్చి విహితవృత్తి
నాల్గుభాగములయేండ్లు నరులకు నాయువుఁ
గలుగు నట్లు చేసె నలుగ నియతి.

సీ. మానవుల్ విజ్ఞానమానధనుల్ నిరం
తరదుఃఖమున మున్గి తమమనముల
నాలోచనంబు లత్యంతంబు సేసి రి
య్యది యేమికర్మ మియ్యజుఁడు మనకు
నల్ప దేండ్లాయు వనాలోచితముగఁ జే
సెను మృగవిహగాదిజీవులకును
నెక్కుడాయువు నిచ్చె నిది యేటి యన్యాయ
మకట! యిప్పని యేఁడు లరుగు నిద్ర

తే. నరుగు శిశుతను పదియుఁ బరుగు ముదిమి
భోగభాగ్యంబు లేక నేడ పుణ్య మేడ
విద్దియలు నేడ ముచ్చటల్ ముద్దు లేడ
మోన మయ్యెను మనకు మోమోట మేల.

సీ. వేదవేదాంగాదివిద్దియ లెట్టులు
వేదాంతసారసంవిత్తి యెట్లు

భావజభవభోగబంధసౌఖ్యం బెట్లు
పుత్రికాపుత్రసమ్మోద మెట్లు
యజనాదిషట్కర్మ లాచరించుట యెట్లు
సంసారమును దరింపఁ జాలు టెట్లు
సభలు సిద్ధాంతముల్ సరసకావ్యము లెట్లు
ఇహలోకకల్యాణసంపద లవెట్లు

ఆ. మఱియు యోగవిద్య నెఱుఁగుట యెట్టులు
వననివాసమునను మనుట యెట్లు
పరమయోగ్యమైన సరజీవనంబు ని
ష్ఫలత నొందె నకట! నలువనియతి. ౪

సీ. కష్టమియ్యది యని గాసిలి జనములు
నవసి యారటమొంది వివశు లగుచుఁ
దూలుచుఁ బొక్కుచు దుఃఖించి చిక్కుచుఁ
బొగులుచు నందఱి నగ మగుచును
నశ్రుపూరంబుల నంశుకవ్రాతంబు
తడియఁగాఁ జెవులును గడియలు బడ
బ్రహ్మఁ జేరఁగఁ బోయి ప్రాఁబలుక్కలను వాని
నతిమనోహరముగా స్తుతి యొనర్చి

తే. మెచ్చఁ జేసియు దేవ! యమేయగుణుఁడ!
వంత గలిగెను నలువదివత్సరంబు
లల్ప మగునాయు విచ్చుట నకట! మమ్ముఁ
గావు పూర్ణాయువు నొసంగి కమలగర్భ! ౫

సీ. విధి యాలకించి యెవ్విధి పీరిఁ దృష్టుల
గావింతు వీరలు భావిసృష్టి
కాధారభూతు లకారణంబుగ వీరిఁ
ద్రోసిపుచ్చుట చాలదోస మనుచుఁ
జింతించి, యుండుఁడు శిష్యుంబ మీకోర్కెఁ
దీర్తును దృష్టిని గూర్తు మీకు
నాసృష్టియం దగ్రనందనుల్ మీరలు
మిమ్ముఁ గాచిన నాకు సమ్మతంబె
ఆ. యనుచు వాయసముల సప్పుడ రప్పించి
గారవించి సుఖులె మీర లనుచు
క్షేమ మరసి వాని చెవిలోన బుజ్జవం
బొప్ప నరులఁ గూర్చి చెప్పఁ దొడఁగె. ౬
సీ. వినుఁడు వాయసము లపితథసృష్టిని నేను
సృష్టిఁ జేసితి నందు శిష్టులైన
మానవు లరయ ననూనసత్వాంచితుల్
నలువదేండ్లాయువులన దృష్టి
నందక వర్షంబు లధిక మర్థింప మి
మ్మిందు రావించితి ముందు వేయి
వత్సరంబుల మీరు వలచిన ట్లిచ్చితి
నం దిర్వదేండ్లను వంగ మీర
తే. లిందు వీరికి నయును వేడ్కొంచువారు
లాడఁ జన దిష్టదేముని యందు రేసి

వేయిహాయనములు మీకుఁ గాయుర్గాత్ర
కష్ట; మంది ర్వ దలఁగినఁ గాదె మేలు. ౭

సీ. వెనుకటికల్పంబు విలసిల్లి సత్పాడు
పాపభూయిష్ఠాను తాపరహిత
జీవనంబులచే విశేషసుఖ ప్రాప్తి
మనుభవింపఁగ నిట్టి మనుగడకును
దావల మైతిరి ధర నొక్క కష్టంపు
దినము తోఁచును వేయి దినము లట్లు
సుఖజీవనం బైన దో యుగంబైన తె
త్క్షణము సాఁగును నొక్క క్షణము వోలె

ఆ. కనుకఁ జింతవీడి ఘనమని యెంచక
యీయాయు వలయు నన్ను హాయనములు
సమ్మతించి యొకవరమ్మును బ్రార్థించి
ధాత తోడ ననె వినీతవృత్తి. ౮

సీ. దేవదేవ! వినుము నీవ సర్వాత్ముండ
వీవుఁ బల్కినయట్లు లిత్తు మిర్వ
దేండ్లు, నరుల్ నల్వదేండ్లు నిండినవెన్క
మా యాయువునుబూని మునినయస్థ
మాలతుణంబులఁ బోలి చరించెదు
నట్టులు సేయు, మా కంతె చాలు
నని యేఁగ, మనుజులకును వాయసంబుల
యాయువు నిర్వదేండ్లవిహతముగ

గీ. నిచ్చి తోడనె చత్వార మిచ్చి యిట్టు
లట్టుఁ జూచుట సెదరుచూ పన్యరీతి
హీనదృష్టియు గౌరవహీనవృత్తి
కాయశోషణాదికములు గలుగఁ జేసె. ౯

సీ. మోదంబుతోడను ఖేదంబుఁ బెనఁగొన
మానవుల్ ధాత సన్మానమునకు
మెచ్చియు మెచ్చక యిచ్చవచ్చినరీతి
గుసగుసల్ వోయిరి కొంద ఱందు
మన కర్వదేములే ఘనముని యిచ్చె నీ
యర్వది యేములు కగుకు జూడ
నడుగుఁ డింకను బ్రహ్మ, నటుగాక పోయిన
సమ్మెయుఁ బెట్టుకం చనెనీ మాట

ఆ. వినరె మీర లనిన వినుతించి యొల్లరో
యనఘ! చాలు దాయువని వచింపఁ
గోపపడక తీర్పఁ గోరె నాతఁడు వాంఛ
నోపినంతవట్టు శాప మిడక. ౧౦

సీ. కానలోపల నొక్క కోనలో నున్నట్టి
ఘనతరోలూకసంఘంబుఁ బిలిచి
మానవుల్ గోరినదాని నెఱింగించి
కాకు లిచ్చిన యీఁగి క్రమముఁ దెలిపి
వేయేండ్లయాయువు గా నొసఁగితిరి మీర
లద్దాన నిరువదిహాయనముల

నిం దటం మును గూబసింపు నాదేశింప
విధి యాజ్ఞగాదని వెఱపు లేక

గీ. రామమహాత్ముండ! యిపుడు మేము మోర్చి యీరు
లన్నియ ట్లిర్వదేండ్లు మా యాయువందు
నైన వారికి మే మిపు డాయువునకుఁ
దగినచిహ్నంబులను వారు దాల్పఁగలరు. ౧౧

సీ. అని చెప్పినంతఁ దద్వినయసంభాషణం
బును మెచ్చియును ఘూకములకు వరము
లొసఁగి వీడ్కొల్పి, యే నొసఁగితి నరుల కా
యువు నర్వదికిఁ బై మఱొక్క యిర్వ
దట్టి యిర్వదేండ్ల బిట్టు నగచు చుపు
గుడ్లగూబలపోల్కి, గూఢవృత్తి
నెవరి నెదురలేక వివశులై యొకరి
తిగ హీనదృష్టితోఁ దేరిచూడ

గీ. నైన బదులుపల్క నైనను జంకుచు
నుమ్మటంచు మూల్గుచుంట దేహ
బలము లేక మూలమలనను గూర్చుంట
తగినచిహ్న మనియె నగియు బ్రహ్మ. ౧౨

సీ. ఇంతట నూరక చింతలన్నియుఁ బాసి
పోరయ్య మానవులార యొసఁగ
ధాత వాక్యంబున వీతసంతోషులై
పోవఁ జూచియుఁ దనివోవ కునికి

మును చేసి నట్టి యాముసాగడ నన్నవి
యేడుల దుర్గతుల్ చూడఁ గల్గి
యును వామనసంబులయును ఘూరకతతులయు
లకుణా లివియుసి పీకుసేసి

గీ. పూర్వకర్మఁపుఁ బ్రేరణమునను గోరి
రిమ్ము మఱి యిర్వదేండ్లు మాహితమునుఁ గోరి
యాయు విడఁ జాలు నోర్థాత యని వచింపఁ
దృప్తిహీనులఁ జూచియుఁ దీవ్రసృష్టి. ౧౩

సీ. నట్టేటఁ ద్రోసిన నెట్టి దోసము లేదు
నరుల కింకేటులు వరము లిప్పు
వినువక కిని మక కసరక కోర్కులఁ
నిచ్చితి వానికే మెచ్చు లేదు
తృప్తిఁ జెందనివాఁడు సప్తసంఖ్యాకంబు
లగు ద్వీపములఁ జక్కనగు నె తెలుప
నియ్యాడె పరమాయు వియ్యురగంబులఁ
బిల్చి యిర్వది యిత్తు నిల్చు నాటు

ఆ. ననియు సర్పములను నాహ్వాన మొనరించి
చెప్ప,నిర్వదియు నొప్పి నవ్వి
యేండ్ల నల్లె వయసు నిచ్చు చోఁ దమచిహ్న
ములను నరులు దాల్పవలయు ననుచు. ౧౪

సీ. అదియె కారణ మెనుబది నిండుసంతనె
నరులకుఁ జిహ్నంబు లరుదు గాఁగ

# యోగిని

చ. ఒకఁడను బంధు లింటను మ
హోత్సవముల్ గని నూరి కేగుచున్
శకట మొకండు మార్గమునఁ
జాగుచు నుండగఁ బూర్వమిత్రుఁ డం
ధ్ధాకరుఁడు బాలు నొక్కని న
నూహ్యరుజాతురుఁ దాను నవ్వయున్
వికలమనస్కుఁడై కొనుచు
వేగమె పోవుటఁ గాంచి యంతటన్. ౧

ఉ. ఆతనిఁ జూచి నే నపుడె
"యచ్యుతుఁడా యెటఁ బోవుచుంటి వెం
తో తడవయ్యె నిన్నుఁ గని
తోడుల కందఱకున్ శుభంబె గా,
భీతిలిన ట్లొకించుక గ
భీరత వాసి నటుంటి వేమి? నీ
పీతతి నిట్టు లుండుటకు
హేతు వదెయ్యది? పీరలెవ్వరో?" ౨

చ. అన నను బోల్చి యాతఁ డను
నద్భుతమున్ ముదమున్ దలిర్ప "నో
యనుఁగువయస్య! యింతపుడె
యల్ల బడిన్ నినుఁ గంటి నేర్చుచున్

విను పదియేడులయి మనము
వేర్పడినన్ బదినూర్ల యేండ్లటుల్
మనమునఁ దోచు నాకు శుభ
మౌ గృహమందలి యెల్లవారికిన్ ?" ౩

ఉ. పాప మదేమొ దాశరథి
బాబుకుమారుఁడు వీఁడు బుద్ధిసం
దీపితుఁ డౌచు విద్దెలను
దెల్విని దేటను నేర్చుచుండ నే
పాపఁపురోగమో సుఖముఁ
బాడొనరించెను సంధి పుట్టి సం
తాపముఁ జెంద వీని నిజ
ధామముఁ జేరుపఁ గొంచుఁ బోయెదన్. ౪

క. ఈముదుసలి యీబాలుని
వేమఱుఁ గనుపెట్టియుండి వివిధపదార్థ
స్తోమంబుల నిడి పెంచును
నే మఱి, దురంతదుఃఖ మెట్లోర్చు నొకో. ౫

ఉ. బాలునితల్లి చిన్నపుడ
పట్టది మృత్యువునోరఁ దల్లి కాఁ
బోలు నటంచు నెల్లజన
ముల్ భ్రమఁ జెందెడురీతిఁ బెంచు గో
రాల భరించుచున్ గనిక
రంబున సాదరపూర్ణచిత్తయై

బంచల్ చింపుచుఁ దిట్లు తిట్టుచును నా
బాలుండు "రారో మీమున్
నంచిన్ దూరిచి బంగిఁ జేసెద నిదే
సత్త్వైకభీముండ నే"
నంచున్ దూఁకెను బండి నుండి యపు డే
నాబిడ్డపైఁ బ్రేమచేన్. ౧౨

ఉ. సాయముఁ జేసి బండి నిడి
చట్టలు దగ్గఱ బండిపట్టికున్
బాయని యట్లు గట్టి వెడ
పాటలు పాడకు నోరు మూయు మ
బ్బాయని మందలించి యిఁక
భద్ర మటంచును మిత్రుతోడ నేఁ
బోయెద నయ్య మిత్ర సెల
వున్ గొనినా విని యవ్వ యిట్లనున్. ౧౩

ఉ. "ఓయి మహానుభావ! నిలు
మొక్కటిఁ గోరెదఁ జెప్పి యేగుమా
నాయనుఁగున్న సుంగితఁ డ
నామయుఁ డయ్యెడు మార్గమేది తం
డ్రీ! యిటువంటిరోగముల
నెక్కడ నైనను జూచి యుంటివా?
నాయెద చల్లఁగాఁ దెలుపు
నామనుమండు మనంగఁ జయ్యనన్. ౧౪

ఉ. ఈపసికూనకై వారి వా
రీ! యిడుకొంటిని నాదు ప్రాణముల్
ప్రాపితఁ డంచు నెంచితిని
భాగ్య మదెట్టులు గాఁగ నున్నదో
శాపము పెట్టినట్టు లిటు
సంభవ మయ్యెను పాడురోగ మీ
తేఁపకుఁ గోలుకోనియెడఁ
దీఱుదు నూతనో గోఁతనో తుదిన్ ౧౫

శా. ఈ రీతిం బరితాప మందుచుఁ గరం
బీరెల్గుతో నవ్వ నా
తో తెప్పార్పక చూచి పల్కఁ గని తో
డ్తోడన్ భయం బందితిన్
బీరా లెచ్చుట కేఁగెనో కడుదిగుల్
జేకొత్తె నాయుల్ల మం
దారాత్రిన్ గల లేమి వచ్చెడునో యం
చైనన్ ధృతిం బూనితిన్. ౧౬

ఉ. ఆశ యదెట్టిదో నరుల
నందని మ్రాకులఁ బండ్లు గోయఁగాఁ
బాశము వైచి లాగు, నది
వారిని ముగ్గిన వాని నక్కటా
లేశము గడ్డి పోఁచఁ గొని
లేవఁ దలంపిడు, దప్పిఁ దీర్ప నా

పోశన మెండమావుల ర
యంబున జేయఁగ నూహఁ గొల్పెడున్. ౧౭

క. ముడుతలుగల మోమును దన
బుడుతకునై భీకరముగ ముడిచి యమునకున్
జడుతునె నే నను నియమ
పడఁతులు సాహసిక లనుచుఁ బల్కరె ప్రాజ్ఞుల్. ౧౮

మ. అని చింతించియు నిట్లు బల్కితని నే
"నమ్మా దిగుల్ సెందఁగా
ఘనమా యియ్యది గోటఁ దీటుగ గదా
గన్గొమె ప్రాణాలపై
ననుమానంబును గొల్పుజాడ్యములు వే
లం దిద్ది యేమాత్రమా
వినుమా! నాటికినాఁడు తగ్గు నిద సా
ధ్వీ నమ్ము నామాటలన్ ౧౯

చ. అన విని యవ్వ యిట్లను మ
హామతి నీవు వచించినట్లు గా
గనుదునె యంతభాగ్యము న
ఘంబులు దీఱఁగ వంత లన్ని యున్
జనునటు పల్కినాఁడవు స్వ
సంతతి వర్ధిల వేయివత్సరాల్
మనగదవయ్య పుట్టుదు సు
మా ఋణ మీఁగఁగ నీదుకడ్పునన్. ౨౦

క. అని ముదుసలి యనుచుండఁగఁ
గనుఁగొని మిత్త్రుఁడు సెలవుఁ గైకొని యేగన్
జనియెను శకటము నే నొకఁ
డని నిల్చితి విస్మయం బెసందన్ గదుఁగన్. ౧౧

చ. ముదుసలి చూపుచుండిన య
మోఘుఁ బ్రసంగము మోహ మంచుఁ ద
న్మృదుతరచిత్తవృత్తియె యు
రిష్టపుఁ జంచలభావ మంచు మం
చిగ యను నేపరాని వ
చింతురు పామరు లైన వార లా
యానన దదంతరంగగత
నూ పసి మోహనాత్మభావ మెంచకే. ౧౨

ఉ. బాలునిజీవమే తినదు
భావమునందుఁ దవేకవృత్తితోఁ
గాలము దేశమున్ గడుపఁ
గల్గినరీతిని నిల్పి శోకమున్
బాలుపడంగ నీక హృద
వారణఁ జేసియు భ్రాంతి సవ్వ యూ
పోలికఁ గర్మయోగమును
బూనిన ఏంచును నూహ సేసెదన్. ౧౩

ఉ. తల్లియొ తండ్రియో హితులో
తాతయొ యువ్వయొ మేనమామయో

పిల్లల సాఁకు చోపికను
విష్ణుని కార్యము నిర్వహింపఁగా
నొల్లని చో జగంబునను
నూర్జితవృత్తిని వృద్ధి గల్గుచే
పల్లవపత్రపుష్పములు
పాదప మందునె పెంచ కుండినన్. ౨౮

క. బ్రహ్మోపాసక యోగియు
బ్రహ్మార్పితచిత్తవృత్తి భక్తవరుండున్
బ్రహ్మవిచారజ్ఞానియు
బ్రహ్మాసక్తాత్మ్యయవ్వ పాటియె యందున్. ౨౯

# సహనము

(లార్డు వాలన్షియాచరిత్రనుండి గ్రహింపఁబడినది.)

శా. శ్రీరంజిల్ల దిగంతకీర్తియుతుఁడై
శృంగారధామం బనన్
బేరుం గాంచుసిరంగపట్టణమునన్
విఖ్యాతకర్ణాటరా,
జ్యారూఢుండగు హైదరాలిసుఁధా
ణాంకున్ బ్రశంసింపఁగా
నేరన్ జాలునె ధాతయైన యతనిన్
నిర్మించువాఁ డేనియున్. ౧

చ. ఒకపరి రంగపట్టణాన
మున్నతమాధవగేహమందునన్
బ్రకటముగాఁగ హిందువులు
వచ్చెనివే తిరునాళ్ల టంచుఁ గో
రిక లిగురొత్తఁ బూర్వమగు
రీతిని నుత్సవము ల్ఘటించి నే
వకుఁ జనుదెంచినట్టి బహు
భక్తజనంబులు గూడఁ దోఁగరాన్. ౨

ఉ. శ్రీలలనామణిన్ వారినిఁ
జిత్రవిభూషణవస్త్రగంధతాం,

బూలసితాభ్రకంకుమును
పుష్పవినిర్మితమంజుదామపూ
జాలలితంబుగాఁగ బహు
చామరదండసితాతపత్రముల్
బోలఁగఁ దాల్చి హేమమయ
పుష్యరథంబున నూరి చేరఁగన్. 3

మ. కదలింపంగ నిఁకేమి చెప్పుదును ద
త్కంజాక్షుసద్వైభవం
బెదురన్ మ్రొక్కెడువారు హారతులు పం
డ్లీయంగ నేతెంచువా
రుఁ దగన్ గీర్తనఁ జేయువారును నటుల్
రోదోంతరం బంతటన్,
మృదువాద్యంబుల నింపువారు నగుదున్
నిస్తుల్యమై యొప్పెనన్. ౪

చ. ఇటువలె వీథులన్ జనుచు
నెచ్చట నాగరకయుత్సవంబు నా
డట నొకచోటఁ దుర్కులకు
ధర్మగురుండగు "పీరుజడ్డ" యను
గటికసియింటిముందు చన
గానతఁ దుర్గుఁడు విగ్రహంబులన్
బటుగతి పర్చి సేసెను న
వాచ్యుల దండన సేతునం చొగిన్. ౫

స్ర. ప్రేక్షచ్ఛా త్రుల్లసహాసగుం
బెగురుచుఁ జనుదేఁ బిట్టుగా నార్చి చంచ
ద్ద్వేషాహూతాగ్నిదీప్త
ల్పెలుచఁగొట్టియుచున్ భీమగండంబులున్ రాల్
కాక్షేయంబు ల్గవాదు [హంబున్
ల్కాసములఁ గోసియున్ గ్రౌర్య మొప్పఁగ మ
ప్రక్షోభం బొంగుచుట్టుల్
పరిపరివిధులన్ బాడొనర్పంగ నంతన్. ౬

ఉ. ఉత్సవ సంతసంబున్ జెడియె
నద్భుతుఁడై సగిలి "పీకజడ్డ" యన్
గుత్సితవర్త[illegible]బు[illegible]
ఘోరతి మించుచును హైవరాలికిన్
వత్సలుఁడై సమానికి న
వారితపద్ధతి హైంసవావళుల్
తత్సముఖంబునన్ దెలుపఁ
దా విని చింతిలి యూతఁడిట్లనున్. ౭

శా. "ఏమీ! యూతఁడు నింతఁ జేసెనకటన్
హేయంబుగా నంతలో
మీమానం బెటుపోయె పూరుషులె కా
మీ రెల్లరున్ బాడిపోన్
నామాన్యుండగు పీరటంచు జడియుం
[illegible]బోల దివ్వెట్ల రేఁ

పే మీా రందఱు సత్సవంబుగొని యా
వీరున్ వధిక గెల్వుఁడీ." ౮

చ. అనువచనంబుతో హృదయ
మం దుదయించిన ధైర్యసంపదన్
మునువలెగాక యాయుధస
మూహముతోఁ గడునుద్యతు ల్వసన్
బనివడి యుత్సవంబుఁగొని
వచ్చిరి హైందవు లట్టిపీరు నిం
టిని గడువంగఁ బోవఁగ స
డిన్ గని యాతఁడు నిశ్చితాత్ముఁడై. ౯

మ. వినుఁడీ శిష్యులు కాఫరు లగ్రంగా
విచ్చేసినా రబ్ధిలే
కనుమానం బిఁక నేల నాశనముగా
ఖండింపు 'డల్లాఖుదా'
యనుచున్ విగ్రహపూజ సేటనె ముగిం
పౌ లోకమం దన్నియుల్
చనఁ జేయంగ నటంచనఁగఁ గుపితు
లర్జించి వారందఱున్. ౧౦

మ. స్ర. గరువంబు ల్మీర దూకన్
గని హరిభజనల్ గట్టిగాఁ జేసి హిందూ
వరు లెల్లన్ తీక్ష్ణఖడ్గ
ప్రముఖబహువిధప్రౌఢఘోరాస్త్రంబులన్ వే

మరు పీరున్ వానిశిష్యుల్
మరణభయసము న్మత్తులై పాఱిపోవన్
దరుమంగన్ విష్ణుసేవ
ల్తదుపరినిఁ బ్రమోదంబు నిండంగఁ జెల్లెన్. ౧౧

చ. ఉసురులు మేన నుండియును
నూరక చచ్చినవాఁడువోలెఁ దా
వసురుసురై యొడల్ రుధిర
మంకట నిండఁగఁ దూలి యయ్యయో
దెస యిఁక యేది నా కనుచు
దీనముఖంబున నశ్రుధారలన్
వినవినఁ జార హైదరుని
పేఁటికి నేగియు పీరుఁ డిట్లనున్. ౧౨

క. హిందువు లందఱు నుత్సవ
మందు నన్ శిష్యసంఘ మంతటి జీవం
బుం దోఁచుగఁ గొట్టిరయయ్యో!
యిందర్వాల శిక్ష సేసి యేలుము నన్నున్. ౧౩

క. అంటయె తడవుగ హైదరు
"కంటిని నేరం బిఁకేమి గావలె మీఁకున్
కంటిరి యర్హ్వాఫలంబుల్
వింటిని మీ చరిత మెల్ల వీనులు మెచ్చన్." ౧౪

చ. అనుటయు "పీరుజడ్డ" విను
హైదరలీసురధాణ శేఖరా

మనది మహమ్మదీయమత
మార్గము విగ్రహపూజ లేని దీ
జననుత రాజ్యమున్ మతము
చాయన వర్తిల నొప్పు నీవునున్
ఘనుఁడ మహమ్మదీయముగఁ
గ్రాలెడు రాజ్యఁపు జక్రవర్తివిన్. ౧౫

ఉ. అం చిటుపల్కు "పీరు" కయి
హైదరు గిట్టున మల్లి తీవ్రతఁ
గాంచుచుఁ బల్కె నేరివచ
నం బిది? రాజ్యము మహ్మదీయమే
యంచును నేను దానికి న
రాధిపుఁడంచు వచించినాఁడనే
యించుక మైన? యిట్టివిధ
మెన్నఁ డెఱుంగను మాను వంచనల్. ౧౬

ఉ. వంతను మాని యేగు మన
వాక్కుఁ గవల్పఁగ లేక యొంటరిఁ
వింతలు వాదము తెలిపి
"పీరును" నాతని బుద్ధిఁ ద్రిప్పగా
నింతయుఁ జేతగాక సుమ
హావిభుపైఁ గలకోపభావతన్
బంతముఁ బూని యేగెను ని
వాసముఁ జేయఁగ "అరకాటునన్."

శా. ఆరాట్పాట్లనుందు నెక్కడ సుఖం
బావంతయున్ గానకే
తర్కం బెంతయుఁ జేసి తుట్టతుదకున్
దా నేగె మైసూరికిన్
కర్కోటం డితఁ డంచు హైదరు బహి
ష్కారంబుఁ జేయింపఁగాఁ
గోర్కుల్లానియు "పీరు" చెన్నపురిలోఁ
గోల్పోయె జీవంబులన్. ౧౮

# పెద్దమఱ్ఱి*



వృక్షమా ! నీవు ఘనమిని వీకి తర్యో !
పాడుపెనుగాలి యొఁగుండివచ్చె నీకు ?
ఎన్నియెన్ని యొజన్మంబు లెత్తితివొ త్రి
సుఁతమైనను మనమున శాంతిలేక
భవజలధివీచిడోలికా భ్రాంతినుండి
విశ్రమముఁ జెందఁ గోరియు వృక్షమైతి
వేమహామహుఁడోగాని యింతకంత
బీజమును నాటెనో లేక సాజమైన
గుణముచేతన బండుఁగొని తినియును
విత్తనము రాల్చె నేద్విజసత్తమంబొ
పుట్టి పెరిగియు నాదిని పురిటిగండ
ములను గడచియు మేకలములు గడచి
ఎచి నింగికి నెగసియు నెల్లదిశలఁ
గడకుఁ జిమ్ముచు శాఖలు వెడలుచుండ
నూడ లెల్లెడఁ దించియుఁ జూడఁజూడఁ
బ్రళయతాండవమందున బాహువితతి
లోకముల నాక్రమించునాలోచనమునఁ

---

* ఇది కీ॥ శే॥ నామిత్రులు శివపురపు నాగవీరయ్య ఎం. ఏ. గారి ప్రోత్సాహమున మొట్టమొదటఁ బ్రకటించితిని.

క్రూరముగఁ జూచు మారటరుద్రభంగి
బలి నణంపఁగ బ్రహ్మాండభాండ మెల్లఁ
బాపములఁ బెంచు నామనస్వామి రీతి
భయముఁ గల్పించుచుండియుఁ బ్రాణిరక్ష
ణమున నేనుజకేలఁ శరణాంబ వగుచు
ముందు గర్జించియుఁ వృష్టి మోద మిచ్చు
మేఘుఁడో యనఁ గరుణ సమోఘ మగుచు
తుల్యమే లేని నీ విప్డు దూర మైతి
వృక్షమా! నీవు పుడమిని వీడి తయ్యో!
పాడు పెనుగాలి యెందుండివచ్చె నీకు? ౧

చల్లఁదనమునక్కై యల్లనల్లఁ జేరి
పండులను మెక్కి పొట్టల నిండఁ జేసి
పక్షు లెల్లను నిన్ను మెచ్చి బహువిధముల
కుహుకుహూయంచుఁ గోయంచుఁ 'కూ'యటంచు
కేవు మనుచును గీచని కెక్కు మనుచుఁ
గడు మనోజ్ఞముగాఁ గూసి కలసిమెలసి
మిథునములుగూడు నవ్యాంపు మేటిప్రేమ
మగడియాపక్షి తనజంట మగువపక్షి
కిట్టులను "ప్రేయసీ! విను మేవి ముద్దు
లివిగొ తెచ్చితి ఫలముల నింపుఁగులుక
నవసుధామాధురీఝరి నవఘళించు

ప్రవిమలజలంబుఁ బుక్కిటఁ బట్టి తెత్తుఁ
బ్రేమసామ్రాజ్యపట్టంబు ప్రియము మీఱ
నిదిగో కట్టితి ముద్దుల నిమ్ము చెలియ"
యనిన సిగ్గునఁ దలవంచు నతివపక్షి
ఋతువు నీక్షించి యాసక్తిఁ బతినిగూడి
గర్భము ధరించి కల్గెను నర్భకులకుఁ
బూరులను బుల్లలను మఱినార నాఁచు
తెల్లఁ గొనివచ్చి నీడంబు నేర్పరించి
గ్రుడ్డులను బెట్టి పొదిగియు బిడ్డలఁ గని
పెంచి పోషించి యాహార మిచ్చి, మంచి
చెడ్డ లెఱుఁగక పిల్లజీవములను
పొట్టఁ బెట్టుక పుట్టలో మిట్టిపడెడు
పాడుపాములచేతకు వగచివగచి
యైన నీయందె సంతతబద్ధానురాగ
వృత్తి నీవె స్వర్గం బని హత్తియుండు
పక్షిజాలంబు నడవుల పాలుచేసి
వృక్షమా! నీవు పుడమిని వీడితయ్యో!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు? ౧

"పరులయుపకృతికై చెట్లు ఫలముఁ గాంచుఁ
బరులయుపకృతికై నదు ల్పాఱుచుండుఁ
బరులయుపకృతికై యావు పాలు పిండుఁ

బరులయుపకృతికై కృపాపరులసిరులు
ఎండలో నీవు మాడియు నెల్లవేళ
లందు నొరులకు సచ్ఛాయ లందఁజేయు
తనకుఁ గానిధర్మంబునఁ దనరుచుండు
వట్టినిర్వ్యాజకారుణ్య మరుకుగాదె.
మండువేసవి యుండిన నెండ గాలి
గ్రక్కుసెగ్గాలచేఁ జెవు ల్గడియలుఁబడ
నెంతయో దప్పిచే జిహ్వ లెండిపోవ
వ్రేలఁబడుతనశిశువుల వ్రేలఁ జూపి
పురపురను బొక్కుపానము ల్బాపన్పలేక
తరుణి విశ్రమ మర్థింప దాని జాలిఁ
జూచి పథికులకు నీడకై వేచియుండె
వృక్షమా! నిన్ను గాంచియు వేడ్కఁ జెంది
అహహా! యీశీతలచ్ఛాయలంచుఁ బొగడి
తనదుమూటల నట దించి తాను వేగ
సలిలములఁ దెచ్చి శిశుకలకలము మాన్పి
పూరిఁ బుల్లలఁ జిప్పకై పోయి తెచ్చి
కాంత వండెఁ గని తాను గఱ్ఱుచును
ద్రేఁపి యుండె భోజనా ల్దీరఁగానె
సరసనర్మోక్తిమధురసాస్వాదనమునఁ
బ్రొద్దు తూలినయుంబాక ప్రొద్దుపుచ్చి,
పుల్లలను రాల్చి పథికులు నుల్ల మలరఁ

బైకిఁ జూడఁగ మలమును వారిముఖము
లందు రాల్చెడిపలుగాకి క్రిందుఁదినము
గాడఁ దిట్టియు, నీవె స్వర్గం బటంచు
మెచ్చులాగు నింటికడ కేఁగి మెప్పుఁ జెప్పు
నట్టిసౌభాగ్యగరిమంబు నడవిపాలు
చేసి పోయితి వృక్షమా! హీనమైన
మమ్ము దయఁ గనవైతివి మానసమున
వృక్షమా! నీవు పుడమిని వీడి తయ్యో!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు. 3

పూర్వకాలాన పుణ్యాత్ముఁ బురుషు లెవరో
నీదు మ్రోలను బలివేంద్ర నిర్మితముగఁ
జేయఁ బతుసత్వమునను నజేయమైన
ప్రౌఢయా నా ప్రపాబాల పాంథుఁ బిల్చి
"నవశిరీషకోమలాంగు నట్టిదేహా
మతికఠోరఁపు జైత్రసూర్యాతపమునఁ
గందె డస్సితి కట నిల్వ మిందుఁ గనుము
చంద్రచందనశీతలచ్ఛాయ నిదిగో
గగనగంగాతరంగిణీకాంతజలము
నపహసించెడి నిర్మలాస్యంతసురభి
శహితజలపూరములఁ దృష్ణ రహిత మగును
సుందరాకారమన్మథశోభి నీవు

నేను నవయౌవనోద్భాసి నేమిచెప్ప
నొక్కరుండవు నీవు నే నొక్కరితను
పైనఁజెప్పఁగఁ ద్రప నన్ను బాధ సేయు
నీవ యెఱుఁగుదు చతురత్వనిధివి గాన"
యనెడునుత్కృష్టకాలంబు లంతమంద
వృక్షమా! నీవు ఘాడమిని వీడి తయ్యొ!
పాడు పెనుగాలి యెందుండివచ్చె నీకు. ౮

ఊరిలో బాలు రంగఁడు నూరు వెడలి
యతివిశాలంబవని చేరి యతిముదమున
గ్రోఁతితోఁ బ్రహ్మాంచునాను బ్రొద్దుఁగ్రుంక నాఁడి
"మసనుసంచని చీఁకట్లు మూసుకొనియె
బ్రహ్మరాకాసి గల దిఁటు బారిపోద"
మంచుఁ బసిగొన్నకు వారి లజ్జ లరయ
నిత్యనిర్మలసుకృతయానిదునాత్మ
దుష్టభూతాళిఁ బారంగఁ దోలలేదె
వృక్షమా! నీవు ఘాడమిని వీడి తయ్యొ!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు? ౯

ఎన్నొ పశువులు నిన్నుఁ జేరి యెండలందు
గుములుగా విశ్రమించియుఁ గోర్కెఁ దీర
నొండొరుల మేనులను నాకి కొండొకవడి

మందమలయానిలంపుటానంద మంది
పోవుచుందును నిన్నెరు పోఁగలరు
జీవరాసులకోట్లకు జీవ మైతి
విప్పు డెవ్వరిగోడునుఁ జూడకుండ
వృక్షమా! నీవు పుడమిని వీడి తరయ్యో!
పాడుపెనుగాలి యెందుండి వచ్చె నీకు? ౬

నీదుక్షమ నెన్నఁగా భువి నెవరితరము
వర్షములు రాఁగ నెండల వాఁడితనము
వేడిగాడ్పులనిష్ఠురవితతపరుష
బాధ లన్నియు మఱచెదు సాధుతమమ
శీతకాలమునందు నశేషవర్ష
బాధలను విస్మరించెదు ప్రథితమతివి.
ఎండకాలాన శీతఁపుగండుచలియు
ఆకు రాలుట మోడుపై యఖిలదుఃఖ
మనుభవించుట మఱచెదు వినుతిఁ గనుదు
నిత్యసుఖవయి కాలంబు నెఱపుచుందు
బాలకులు కోఁతికొమ్మంచు లోలి నాడి
నిన్ను గలచిన చెద్దయము లెన్నమ్మనమున
నిడవు ఫలములకై రాళ్ళ నిట్టు నట్టు
లేయువారిని, విస్మళ్ళ కిపియునాకు
యోగ్యమగు నాకు లంచను భాగ్యహీను

నౌషధంబుల పాలివి యంచుఁ జెప్పి
చెక్కలను దీసి వ్రేళ్లను జిదుకఁగొట్టి
సట్టిదుర్మార్గజనులను నార్తిపరులఁ
జిచ్చునకుఁ బుడకలంచును బచ్చికొమ్మ
లచ్చుపడఁగఁ గొట్టి యొండించు మ్రుచ్చుజనులఁ
దెగడ నంతఃకరణముగల దివ్యమతివి.
సార మింతైనలేని సంసారమందుఁ
దృప్తివలనను మోక్షము ప్రాప్తమగును
క్షమవలన నెల్లదోషులు సములు లగుదు
రనెడుభావంబు యోగులకండరాని
దాసిఁ జాతితి విన్నాళ్లు మానితమతి
ఇంత నీమూర్తిఁ జాలించి యిచ్చలేసి
శాశ్వతానందమున్బ్రాప్యసౌఖ్యపదము
పొందఁగాఁ గోరి పెనుగాలిఁ జెంది తీవు.
నాకు దయసేయు కాంతి నాకసౌఖ్య
మిరువురముఁ గలసి యచ్చట నిరివిరిగాని
మెలసియుందము; నాతాపములను జెప్ప
మీశ్వరునిమ్రోల నన్నుఁ దరింపఁజేయు
మోయి పుత్రమ! మోక్షము నూనినావు
లేరు నినుఁబోలు ధన్యులు లేరు లేరు
లేరు కన ముజ్జగంబుల లేరు లేరు.

# ఇ రు వు రు



గీ. మసమసం జనఁ జీఁకటుల్ ముసరుకొనియె
ఘనజఘనభారమును మీఱి తనదుకురులు
కాటుకల మించి నల్లనై క్రాలుచుండ
నీలవర్ణపుఁజీరను నెమ్మిఁ దాల్చి
కదలు ముత్తైదువను బోలియు దిశ లడర
రేలతాంగి పేరంటము రిక్కలనెడు
పిన్నముత్తైదువలఁ బిల్చుచున్న దదిగో;
పట్టపగ లీఁతలాడియు బాల్యచేష్ట
లను గలంచినతుంటరులను గలుగుఱుఁ
దిట్టినట్టు నదీకాంత కేఁకరి సణఁగె;
గింగురు మనంగ శ్రోత్రముల్ కీచురాళ్లు
వెడలి చెలరేఁగె; మూలల నడఁగియున్న
గూబలు భయముఁ గొల్పుచుఁ గూత లిడెను;
దీర్ఘగంభీరనినదముల్ దిశల మూరు
మ్రోఁగుచుండఁగ; సర్పముల్ పుట్టలు విడి
యెల్లయెడలఁ బాఱాడెను నల్లమడల;
నక్కలవిరావము లవె కోనల వినఁబడెఁ;
బక్షులు రుతములను మాని వృక్షములను
గూండ్లఁ దాఁగెను; బొదలును గొప్పచెట్లు

భీకరాకృతిఁ గన్పడెఁ; బ్రేతగణము
తోడ భూతంబు లాడెను; దోఁచెఁ గొఱవి
దయ్యములు లసంగ మిణుఁగురుల్ తళతళమని;
యపరిచితమయి వర్తిల్లు నట్టిపల్లె
టూరిబయల వనంబున నుంటి నప్పు
డిరువు రొకరికి నొకరట యెదురుపడిరి. ౧

పగటిసందడులెల్లను బడఁగ నొల్ల;
శ్రుతిపుటవిభేదకరశబ్దతతులఁ జెవులు
పగుల దుమ్ములుఁ జెలరేఁగ మిగుల ధూస
రితము నగరపట్టణపథంబు సతము నొల్ల;
రచ్చకెక్కి బిడియము నరమర లజ్జ
లేక భుజముల నెత్తి యనేకవిధులఁ
బ్రేలుచుండెడువారల రీతు లొల్లఁ:
బట్టబయలఁ బ్రగల్భముల్ పల్కునట్టి
దుష్టమదమత్తపురుషులతోడు నొల్ల;
నొల్ల వాదముల్; చర్చలు నొల్ల; తగవు
లొల్ల; వికటాట్టహాసంబు లొల్ల నేను;
వలతు నేకాంతవాసంబు; వలతు రాత్రి;
వలతు నిశ్శబ్దసీమలౌ వనపథములు;
వలతు రిక్కలఁ జూడఁగ; వలఁతుఁ జింత;
చూతు లోకంబు నేరిచేఁ జూడఁ బడక;

యట్టియే నష్టు కనుమేర నిట్టి చూడ
నిరువు రొకరికి నొకరట నెదురుపడిరి. ౨

దీర్ఘపీవర దేహముల్ తేజరిలఁగఁ
దవిలి నఖశిఖపర్యంతధవళదీర్ఘ
ధౌతవసనముల్ నిండుగాఁ దాల్చి కదిసి
గుసగుసలువోవు తెఱఁగునఁ గోరి నిలచి
రెవ్వరై యుందు రీనిశి నివ్వనమున
నొంటరిగ నుండ హేతు వేముండు నకట!
ప్రియుఁడుఁ బ్రియురాలు నిస్తులప్రేమ వెడలి
తమదుసంకేత మచ్చటఁ దగనొనర్చి
గూఢవేషములను దాల్చి గుసగుసలను
బ్రణయములు దెల్పునట్టి సంభాషణములఁ
జేయుచుంటిరో? యన్యదుర్ శ్రీల నపహ
రింప నేయుంటిఁ గన్నము నింపవలయు
నంచు నాలోచనముఁ జేసి నలరి యుండు
నుంటిరో? లేక పీర లబ్ధుండవృత్తి
హాస్య లోనరుప నీమొద నాత్రమంది
గూఢముగఁ జంపనేసెను క్రూరమతులో?
అత్తదుంపగముల నెంచ నవలి కేఁగు
నింటికోడండ్రొ? కావలిబంటు లేమొ?
తంత్రసాధకులో యేమొ? మాంత్రికవరు

లేమొ ? భూతంబు లయ్యేడు నేమొ ? యిట్టు
లిరువు రొకరికి నొక రట్ల యెదురుపడిరి. ౩

ఎంతయో చింతఁ జేసితి, వింతపడితిఁ
గాని దరిఁ జేర సాహస మూన నైతి ;
లోకవృత్తంబుఁ గూర్చి యాలోకపతిని
గూర్చి ప్రకృతిని గూర్చియుఁ గోట్లకొలఁది
యూహ లల్లితిఁ ; జీఁకటియును విశేష
ముగ నలమెఁ ; బ్రక్కలందును ముందు వెనుక
నెద్దియును దోపదయ్యె సమీక్ష సేయ ;
నిట్లు చింతించు చాస్థలి నెంతసేపు
కూరుచుంటినో యెఱుఁగను, గొంతవడికిఁ
గోళ్ళుఁ గూసెను, గ్రమముగ దిక్కులును నంత
తెల్లనగుచుండఁ దారలు తేజ మెడలి
యొక్కటొక్కటి గను జారె ; నుదయరక్త
శోభ లెల్లెడ వ్యాపించెఁ ; జూడఁజూడ
భానుఁ డప్పుడు కన్నులపండు వయ్యె ;
క్రమముగఁ గననయ్యె వనమును ; కట్టెదుటను
వల్లకా డున్న తెఱఁగును ? బఱఁగు టచట
నొక్క శైవసమాధి, యాప్రక్కలందు
నిలువుగాఁ బాతి సున్నము కలయఁబూసి
యొకటి కొక్కట కెదురుగా నుంచఁబడిన
శిలలు రెం ; డంత సంశయచ్ఛేదమయ్యె. ౪

ఇటులె తామసవ్రాగితవృత్తిసహిత
మానసము చూచుఁ బ్రకృతిని వేనవేలు
విధములుగ; భ్రమఁ జెందుచు వెతలఁ బొందు
జ్ఞానభానూదయంబు నిస్సంశయంబుగ
బహుళసంసార తామసబాధ మాన్పి
ప్రకృతినిజవృత్తి స్పష్టత బయలుపఱచి
శంకలను బాపు నాపరసత్య మప్పు
డనుభవించుచు నానంద మందు నరుఁడు. ౫

# భానూదయము

సీ. అరుణారుణప్రభాస్ఫురణంబు దిక్కులఁ
దరుణారుణాశ్వత్థదళములఁ గవియు
నంజననిభతమోఽనంతసంతానంబు
గిరిగుహాగృహముల కరుగుచుండ
రమణీయకలకలారావంబులను గోక
శుకపికకేకు లెచ్చుగ నొనర్ప
సురుచిరకంఠసంశోభితస్వరముల
నాఁకొన్న క్రేఁపు లంబా యనంగ

గీ. కాల మెఱిఁగించు కుక్కుటగళము లెసఁగ
స్వస్వనియతము లగుకార్యవర్తనముల
సుతసతీయుతగృహపతు లున్ముఖులుగాఁగఁ
దూర్పుదిక్కునఁ దోఁచెఁ బ్రత్యూషశోభ. ౧

సీ. ప్రాభాతికము లగుప్రభలు తూరుపుదెస
వెలవెల్లనై తొల్త విశదపఱిచెఁ
దదుపరిఁ బ్రథమసంధ్యారాగములు పర్వి
కుంకుమపంకమున్ శంకఁ గొల్పె
దండెత్తినట్లు సహస్రముద్యద్ద్యుతు
ల్తారకంబులను బోఁ దరిమె నెటకొ
నీలరక్తసితాదినిఖిలదీప్తులు కన
త్కనకవర్ణవిశేషకాంతిఁ దోఁచెఁ

గీ. దళశశిళలు గొల్పు కిరణముల్ దర్శనీయ
భాగ్యరేఖలువోలె దిగ్వర్గములను
వ్యాప్త మయ్యెను దెల్వొందె నలరె జగము
తరణి యుదయించెఁ జిత్రప్రసరణి దివిని. ౨

సీ. విధుబింబముఖరతిమధురతఁ గోల్పోయి
తొగకన్నె విరహార్తి మొగము ముడిఁచె
మిత్రసమాగమామేయసౌఖ్యముఁ గాంచి
పద్మిని కాంతిసంపదలఁ బొదలె
నన్యోన్యసల్లాపవృథాన్వేషణాత్యార్త
చక్రనాకద్వంద్వచయము గూడెఁ
గుసుమజమకరందగురుపానసంతుష్ట
మధుకరదంపతుల్ లలసి రేఁగె

గీ. గోత్రపాథోధితరుగిరిక్షేత్రవిపిన
నరసురాసురయక్షకిన్నరవిహంగ
మాపిపీలికబ్రహ్మచరాచరప్ర
పంచ మెల్లెడ సవితృనిప్రభలు వెలుఁగ. ౩

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మముఁ దీర్చి
వేదపాఠాసక్తవిప్రజనము
మంగళవాదిత్రమాగధగానప్ర
బుద్ధధర్మాసక్తభూపరాజి
కల్యనిర్వర్తితకరణీయులై నిజ
వ్యాపారసక్తులౌ వైశ్యవరులు

భక్తపర్యుషితాన్నపుష్టులై నాగళ్లు
గట్టి పొలముల దున్ను కర్షకులును
గీ. స్వర్ణకారకసౌచికచర్మకార
రజకశౌండికలుబ్ధకరాజపురుష
తన్తువాయకశిల్పమార్దంగికాదు
లెల్ల రూనిరి నిజవృత్తు లినుఁడు వొడమ. ౪

సీ. ప్రత్యక్షదైవముఁ బ్రార్థింపరే యని
సకలసత్కారముల్ సలుపువారు
మూర్తిత్రయాత్మకపుణ్యరూపుం డని
ధ్యానమీలితచక్షు లైనవారు
సర్వదేహారోగ్యసాధకుండని నమ
స్కృతిశతంబులను సాగిలెడువారు
కష్టసంగ్రామప్రణష్టశూరులగతి
యాతఁడే కనుఁ డని యెన్నువారు
గీ. స్వప్రకాశత మాయాత్మకప్రపంచ
మును సృజించియు వృద్ధిని బొనరిచియును
విలయమొనరించు నట్టి యావిశ్వరూపుఁ
డుదితుఁ డంచని జనములు ముదితులైరి. ౫

# కాకతీయప్రశంస



సీ. ఆంధ్రక్షమామండలాఖండలుం డైన
రుద్రభూపాలునిర్నిద్రశక్తి
స్వీయరాజ్యప్రజామేయరక్షణశీల
గణపతీంద్రునిలోకవినుతకీర్తి
రుద్రమాంబాకటాక్షార్ద్రసుధాసార
సిక్తవర్ధితలోకచిత్రరక్తి
వీరప్రతాపరుద్రారూఢసింహాస
నాసక్తవరదండనాథభక్తి
గీ. కారణములుగ నెలకొనగలిగి సార్వ
కాలికానూనకీర్తిని గంటివమ్మ
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౧

సీ. భాషించితివి శైవభక్తి సోమనలీల
జాను తెన్గులఁ దేనెసోనగురియ
వచియించితివి సొంపుఁ బచరింప నభినవ
దండిపోకడల నఖండసరణి
పోషించితివి రామభూవిభుకథ భాస్క
రాదికవీశ్వరామోదఫణితి

ఉత్సహించితి యజ్వసత్సాహసంబున
నుభయభాషాప్రౌఢి సభలు మెచ్చ
గీ. రంగనాథ రామాయణరమ్యకావ్య
సారమునఁ బెంచితివి నుడికార మార!
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౨

సీ. చాళుక్యధరణీశసద్భక్తియుతదత్త
భద్రేభసంతతి బాళై ముండె
పాండ్యావనీశసంపాదితాఖిలరత్న
చిహ్నితరథములు సిద్ధమయ్యె
రాష్ట్రపాలకజితరాజసంప్రేషిత
కరములు ధనపరంపరలు వచ్చె
నానావిదేశాగతానూనవస్తువుల్
వర్తకానీతమై ప్రాప్తమయ్యె
గీ. కనులపండువుగా నిన్ను గాంచినట్టి
పరమశీతలదృష్టిప్రభావ మేమొ
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౩

సీ. అరిరాజరక్తారుణాంబువర్షమె గాని
కరుణ లేదాజిని గాంచినపుడు
ఘనరత్నమణివస్తుకనకదానమె గాని
'నాస్తి' లేదర్థులన్ గాంచినపుడు

నవసుధాస్పదకృతు లవధరించితి గాని
కనలేదు నీరసకావ్య మెపుడు
సత్యధర్మాదిప్రశస్తరీతులె గాని
వినలేదు దుర్జనవిధము లెపుడు

గీ. చంద్రచందననిర్మలసాంద్రకీర్తి
గాని దుష్కీర్తి నెన్నఁడు గాంచలేము
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౪

సీ. నీ మంగళారావనినదపరంపర
భావిసంపదల సంప్రాప్తిఁ జేయు
నీశూరవరఘోరనిష్ఠురవీర్యంబు
వేఁడిక్రొన్నెత్తురుల్ విరియఁ జేయు
నీ యాంధ్రసత్సుధానిర్ఝరసూక్తులు
కావ్యకౌతుకలక్ష్మిఁ గ్రాలఁ జేయు
నీ మతాచారసందీప్తధార్మికజీవ
మార్గమతాసక్తి నలరఁ జేయు

గీ. నిన్ను ధ్యానింప మోక్షసౌధోన్నతప్ర
శాంతతత్త్వాత్త కానందసరణి గలుఁగు
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౫

# ప్రకీర్ణము

## ప్రాచీనదేవాలయశిథిలములు

ఉ. శ్రీయుతరాజరాజకుల
 శేఖరుఁ డర్థిజనప్రపోషణా
త్యాయతదానశాలి బహు
 ళాంధ్రజన స్తవనీయసద్యశః
కాయుఁడు విష్ణువర్ధనుఁడు
 గాదె ఘటించె నమోఘమైన దే
వాయతనంబు జీర్ణముగు
 నంచుఁ దలంచెనె యెన్నఁడేనియున్. ౧

ఉ. అల్లదె శాసనంపుశిల
 యాలయభిన్నశిలాతటంబులన్
మెల్లన నిల్చి చూపెడు న
 మేయమునై తగుపూర్వశోభ మీ
యుల్లములం దలంప మహో
 న్నతి గుండెల నీరుచేయదే
కల్లయె కాలదేవత య
 కారణశత్రువుగాదె యేరికిన్. ౨

మ. అరరే! ఊహ కతీత మెంతటి మహా
 ర్హంబైన కల్యాణమం

దిరమో యిద్ది ప్రతిష్ఠవేళ నృపని
ర్దిష్టాధికంబైన వా
ద్యరమానాదము మంత్రరావము భటా
ద్యశ్రాంతసల్లాపమున్
బరమోత్సాహజనాభివాదము కటా,
వ మ్మయ్యె నిష్పట్టునన్ ? ౩

చ. శతములు వర్షముల్ గడచెఁ
జాల్పడి మ్రొగ్గ విచిత్రశిల్పముల్
శతలయిపోయె నీప్రతిభ
గర్వితక్రూరతురుష్కహస్తమ
ర్దితమయి నాశ మందె సము
దీర్ణశిలామయవిగ్రహంబు లీ
వితమును గాంచి కుందెదను
వేంగిప్రభుత్వమహత్వ మెంచియున్. ౪

సీ. ప్రాకారమా యిద్ది పరమాణుతుల్యమై
పొడిపొడియై రాలిపోయె నయ్యొ
మండపస్థలములా మంటిదిబ్బలఁ బోలి
కుప్పలుకుప్పలై కూలిపోయె
శిఖరంబులా యివి శీర్ణమై రూపమే
లేకుండ పుడమిలో లీన మయ్యె
మూర్తియా యిది విరాణ్మూర్తి యయ్యును
నామమాత్రావశేషతాపాత్ర మయ్యె

గీ. ప్రకృతిపురుషసమ్మేళన ప్రకటమైన
జగ మనంతము నం దిట్లు విగతి నందు
నంచుఁ జూపుటకా యిది యహహా యిట్లు
లయముచెందెను బృథివీలలామయందు. ౫

గీ. అఖలభారతవంద్యమై యలరునట్టి
వేంగిచాళుక్యశిల్పవిభిన్నగతికి
వేడిరక్తాశ్రుకణముల విడువనట్టి
యాంధ్రసోదరుఁ డుండునే యవనియందు. ౬

కాలేజివిద్యార్థులపీఠోక్తులు

చ. సిరులకు నాటపట్టు సుఖ
సేవధి, సమ్మదవార్ధి, యార్ద్రిమా
విరినునుశయ్య శ్రాంతులకు
విశ్రుతభూమి రసానుభూతి క
బ్బురమగుపంట క్రీడలకుఁ
బాల్పెసలారు కొతారు స్వేచ్ఛకున్
దెరువు కళాభివృద్ధి, కగు
నిన్నెటు వీడుదు, మమ్మ, కాలెజీ. ౧

చ. గురువులు చెప్పువిద్దియలు
కోరిక విందుము త న్మయస్థితిన్
గురువులబోధ లొక్క యెడఁ
గూడఁ బరీక్షల కాలకింతు మా

గురువులతోడ హాస్యములఁ
గోయని కేకలతోడవిందు మా
గురువులఁ బాయుటెంతటి య
కుంఠితదుఃఖముఁ గూర్చు కాలెజీ. ౨

చ. మరలగ నిందరీవిధ మ
మందరయంబునఁ జేరగల్గునే
మరలగ నిన్నిరోజు లిటు
మాటలు కోటలుదాటఁ జెల్లునే
మరలగ రేవుకద్దనెడి
మాటయెఱుంగక సంతసింతుమే
మరలగ నీదుమోామిటులు
మాన్యతఁ గాంతుమె యయ్యొ కాలెజీ. ౩

చ. నినువిడి యేగనున్నమము
నేఁడెటఁ దెత్తువు బత్తెమండ్రు మా
యనుఁగులు తల్లిదండ్రులు, ప్ర
యాసముఁ జెందుచు వృత్తిదాతలన్
గన నిపుడేది మీాకు నవ
కాశ మిఁకొక్కెడ కేగుమందు రే
మనివచియింతు మమ్మ ప్రబ
లార్తినిసైతు మికెట్లు కాలెజీ. ౪

చ. నినుఁగని ముద్దుముచ్చటల
నీకడ నుండినరోజులెల్ల మా

మనమున నిల్చి భారమును
మాపునుగాక భవంబునందు
నీయనుపమసుందరామృతర
సార్ద్రిసుకోమలదివ్యమాధురీ
ఘనము కటాక్షవీక్షణము
గావుత మమ్ముల నెప్డు కాలెజీ. ౫

కాలేజి సమాధానము.

చ. కలకలలాడు మోములను
గాంచి సుఖించితి నిన్నినాళ్లు ని
ష్కలుషహృదంతరంగములఁ
గల్గును సంస్కృతిభార మిప్డయో
కళలను నేరువున్ గనిన
కాన్పులకంచు విచారమందెదఁ
గలుగుత మాయురభ్యుదయ
కాంతులు మీకుఁ బరాత్పరేచ్ఛచేన్. ౬

కష్టము

మ. పరకష్టంబులఁ జెంది మానవులు బ
ల్యాచాటులై యీశ్వరున్
బరమారాధ్యుని నిందసేసెదరు త
ద్భావంబు నూహింపకే

శరణం బద్ది సమస్తసౌఖ్యములకుఁ
సన్మోక్షమార్గంబునున్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౧

మ. కరమున్ సౌఖ్యఁపుజీవనంబులు సదా
కష్టాంతరప్రాప్తిచేఁ
దిరమై యుండును నట్లుగామి వెగటై
దీనంబులై తోఁచు ని
ద్ధరఁ గష్టానుభవంబులేక సుఖముఁ
దా సారహీనం బగున్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౨

మ. నరు లేవేళ మదంబుఁ జెందుదురు స
న్మానంబుచే వృద్ధిచే
వరబంధువ్రజమిత్రసంతతులచే
వాంఛాప్తిచేఁ గీర్తిచే
గరువం బట్టితఱిన్ శమింప నురవా
ఖడ్గంబుగా నుండుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. 3

మ. పరులో బంధులో యాప్తరీతిని జనుల్
బ్రాప్తంబులౌ వస్తువుల్

వరుసం బొందుచు నిచ్చకంబుల సదా
వర్తింతు రచ్చోటనే
యొరపుల్ రాతివిధాన వేర్పరచు దా
నో మిత్రులన్ శత్రులన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౪

మ. గిరులన్ మూలఫలాదులై మనుచుఁ ద
ద్గేహంబులౌ కానలన్
జిరసంతాపితగాత్రులై తపముచేఁ
జెన్నొందు మౌనీశ్వరుల్
తిరమౌ భక్తిఁ గనంగలేక చెడి రా
దేవిన్ గనన్ జేయుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౫

మ. పరసంతాపనివారణంబు నరుపై
భారంబు ప్రారబ్ధమౌ
పరసంతాపము గుర్తెఱుంగుటయు తా
త్పర్యంబుతో సాయమున్
ద్వరతోఁ జేయగలుంగుటల్ స్వానుభవ
ద్వారంబునన్ జేకురున్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౬

మ. తరణోపాయము మానవాళికి లస
త్త్యాగంబు లన్యార్థమై
చరజంతు ల్నిరతంబుఁ గష్టయుతమౌ
సంసారమం దుంటచే
నరను ల్త్యాగు లుదారు లూర్జితులు ప్రా
శస్త్యంబునున్ బొందుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౭

మ. క్షర మీజీవముపై విరక్తియును న
క్షయ్యావ్యయబ్రహ్మమా
కరుణాసాంద్రునిభక్తి నాస్తికునకున్
గల్గంగఁజేయున్ వసుం
ధరపై భక్తివిహీనజీవనుల కా
ధారంబు భక్త్యర్థమై
పరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౮

మ. పురుకుత్సుండు పురూరవుండు నలుడున్
పూజ్యుండు త్రైశంకునా
పురుహూతుండును కార్తవీర్యసగరుల్
పుణ్యాత్ము లిల్లాంద్రు కా
ధరజా ద్రౌపదిభీమపుత్రి మొదలై
ధన్యత్వముం జెందుటన్

బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౯

## రామరాజపంచరత్నములు

ఉ. రాజకులీన! సద్ధృదయ
రాజితపూర్ణసుఖప్రదీప! తే
జోజితపద్మమిత్ర! భుజ
శోభితభూరిపరాక్రమాద్భుత
శ్రీజయశీల! రంజితప
రీక్షితతత్త్వకవీంద్రపండితా!
రాజమరాళ! సద్గుణవి
రాజిత! రామసునామశోభితా! ౧

ఉ. చిత్ర మయారె! నీహృదయ
సీమనుగల్గు నుదారమాధురీ
పాత్రత, యుష్మదీయశుభ
పావనగేహమునం జనించు స
త్పాత్రులు పుట్టుతోడనె యు
దారమహత్తరభావశీలురై
మిత్రులు మెచ్చ సత్కృతు ల
మేయముగా నొనరింత్రు నిచ్చలున్. ౨

ఉ. నారదసత్కృపన్ బుధజ
నంబు నుతింపఁగఁ దల్లిగర్భమం

దే రహి విష్ణుమంత్రమును
నేర్చెను దైత్యకుమారుఁ డేము సో
దారము నాతిథేయ మను
ధర్మసుమంత్రము జన్మపూర్వమే
నేరువఁ జాలినా మనుచు
నేర్పునుజూపి హసింత్రు నీసుతుల్. 3

చ. అహహా! త్వదీయకమ్రఫల
హారివినమ్రశరుప్రదేశతా
పహరసుశాంతనిర్మలవి
భాసితశీతలసైకతావళీ
విహరణశీలఘుంఘుమిత
విస్ఫురితాఖిలగంధయుక్తమం
దహితసుమారుతంబుల న
నంతసమాధిని యోగు లుంద్రుగా. ౪

ఉ. నీవిభవంబు నీసుగుణ
నిర్మలతేజము నీదుభావమున్
నీవినయంబు నీపరమ
నిర్గుణతత్త్వవిచారణంబులున్
నావిమలార్ద్రకోమలసు
నాట్యఝుళంఝుళనాదపూర్ణసం
భావితకావ్యకన్యక క
పారముదం బొనగూర్చె నద్దిరా. ౫

౹

## దుష్టుఁడు

ఉ. పంకిలమైన బుద్ధియు నపాస్తవి
   నీతియు దైవభీతి యే
వంక నెఱుంగ రామియును
   స్వార్థపరత్వము సజ్జనాళిని
శ్శంకము గేలిసేయుటయు
   సాధుతిరస్కరణంబు పాపమున్
జంకును గొంకులేమి యతి
   సాహసమున్ గన దుష్టవర్తనల్   ౧

ఉ. సారములేదు సత్కళల
   సార మెఱుంగఁడు వట్టిపొల్లు లో
బీరములాఁడ శూరుఁడతి
   భీరువు శక్తి నిదర్శనంబునం
దారయ నందఁజుట్టు మఱి
   యందకపోయినఁ గాళ్ల బేరముల్;
భారముగావె దుష్టునియ
   భాగ్యపుసేతలు రత్నగర్భకున్.   ౨

ఉ. చేరును బజ్జమోసమునఁ
   జేరినచోటనె యింటి వాసముల్
గోరిక లెక్కబెట్టు బలిఁ
   గోరు పరార్థము గుల్లమ్రింగు పూ

జారి యపారకుత్సితుఁడు చయ్యన
దుష్టునిఁ జూచి చూడఁ గే
దూరముగాఁ దొలంగుటలు
తోరపుధర్మము సజ్జనాళికిన్. ౩

## సామాన్యవస్తు నిరసనము

సీ. ఇసుకలు రాలును నిసుమంతమృత్తికల్
గాకుండ కొండలే క్ష్మాతలంబు ?
గడ్డిపోచలు పొదల్ కాసరల్ తీగలు
గాకుండ మ్రాకులే కాననములు
ఉడుతలు మిడుతలు మిణుగురుల్ చీమలు
గాకుండ నేన్గులే ఘనఁపుఁబ్రాణు
లాఁకొన్న బీదలు వాకు నేరని జనుల్
గాకుండ రాజులే లోకమెల్ల
గీ. పిల్లకాల్వలు లేకుండఁ బెద్దనదులు
బాఱఁగాఁ జొచ్చునే భువి భవ్యముగను
ధరను సామాన్యవస్తు సంతతుల యెడల
నీసడింపులు ప్రజలకభ్యాసమకట.

ఓం తత్సత్.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి-8428-34.

# మా ప్రచురణములు

కథాకావ్యము (గద్యము) ౦—౧—౨—౦

కథాకావ్యము (పద్యము) ౦—౧—౨—౦

ఈ రెండు గ్రంథములు నొక్కసారి కొనినచో విద్యార్థులకు మాత్రము, ఒక రూపాయికే లభింపగలవు. పోస్టేజివేరు.

# వెలువడనున్నవి

సచ్చిదానందము (నవల)

దార్శనికమహాప్రవచనము (వచనము)

(శ్రీ జ్ఞానానందస్వామివారి యాంగ్లకృతి కనువాదము)

దివ్యస్ఫురణములు (పద్యములు) శ్రీ జ్ఞానానందస్వామివారి పద్యగ్రంథమున కనువాదము

శ్రీ జ్ఞానానంద సువర్ణమాల (అక్షరమాలా స్తోత్రము)

గంగా పంచకము (సంస్కృతము)

వలయువారు:—

మేనేజరు
శ్రీమార్కండేయభవనము
నరసారావుపేట
గుంటూరుజిల్లా అని వ్రాయవలెను.

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రింపఁబడియె, 1000—8428—34